# పంచీకరణ భాష్యము

మూలము .

శ్రీ శ్రీ శ్రీ శంకరభగవత్పాదులు

భాష్యకర్త

కవిరాజు. కళాప్రపూర్ణ

డా॥ కొండపేటి వెంకటకవి

---

This Book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme 'Aid to publish Religious Books'

ప్రథమ ముద్రణము · 1983


వెల . రూ. 15/-

ప్రోత్సాహకులు :
స్వధర్మ స్వారాజ్య సంఘము
[Orthodox National League]
29, బ్రాడ్వే .: మద్రాసు-600108

ప్రాప్తిస్థానము :
కొండవీటి వెంకటకవి
కవిరాజు వీధి,
విద్యానగర్, నిడుబ్రోలు
గుంటూరు జిల్లా :. పిన్ - 522 123

ముద్రణ :
క్రాంతిప్రెస్, మద్రాసు - 600 001.



కీర్తిశేషులు

శ్రీ కౌతా సూర్యనారాయణరావు



కీర్తిశేషురాలు
శ్రీమతి కౌతా లలితాంబ

# తిలకమ్

ఆంధ్రగీర్వాణభాషలలో సవ్యసాచులై జగన్మాన్యులైన శ్రీకొండవీటి వేంకట కవిగారు వ్రాసిన పంచీకరణభాష్యమను మహాగ్రంధమును చూచి మనసార ఆనందించిన నేను పనిగట్టుకొని యింటికివచ్చిన పండు ముత్తైదువ ఫాలభాగాన సిందూర తిలకమునుంచి పూజించినట్లు ఈ గ్రంథభారతిని తిలకముతో పూజించుట సముచితము, సమంజసమని తలచి తిలకమను పేరుతో నాలుగుమాటలు వ్రాయుచున్నాను.

మానవుడు పొందదగిన పురుషార్థములలో మొదటి మూడు ధర్మ, అర్థ, కామములు శ్రేష్ఠములు. నాలుగవదియగు మోక్షము శ్రేష్ఠతరము. అది నిత్యానందరూపము, ఆత్యంతిక దుఃఖనివృత్తి, అమృతరూపమని అభిరూపశేఖరుల ఆభాషణములు. ఇది సాధనచతుష్టయ సంపత్తిగల ఆత్మజ్ఞానులకే అందునది.

"తరతిశోకమాత్మవిత్" "బ్రహ్మవిదాప్నోతిపరం" "జ్ఞానాదేవతు కైవల్యం" ఇత్యాదివాక్యములు - "అయమాత్మా బ్రహ్మ" 'తత్వమసి' ఇట్టి వేదాంతవాక్యాలు జీవబ్రహ్మలకు అభేదమును ప్రకటించుటచే జీవాభిన్న బ్రహ్మజ్ఞానము శోకనివృత్తికి కారణమని నిరూపణ మగుచున్నది జీవబ్రహ్మల అభేదప్రతిపాదనకే ఉపనిషత్తులు ప్రవృత్తములైనవి.

బ్రహ్మనిత్యమనిచెప్పి ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే యనుట సయుక్తికము కాదు. పరిణామరహితము బ్రహ్మము. పరిణామ సహితము ప్రపంచము. అనాదిసిద్ధ జీవుల సంస్కారబలముచే నానారూపమైన బ్రహ్మమే ప్రపంచరూపముగా భాసించును. దీనినే వివర్తవాదమని శాస్త్రకారుల సంభావన.

అజ్ఞానకార్యములగు అంతఃకరణలలో ప్రతిబింబించిన చైతన్య మొక్కటియే భిన్నభిన్నములుగా గానుపించుట - ఒకే సూర్యుడు పలు జలాశయములందు ప్రతిబింబించినట్లే కదా! ఒకే చైతన్యము వేర్వేరు జీవులుగా భాసించుచున్నది. అంతఃకరణోపాధిచే జీవభేద మేర్పడ్డట్లు మాయోపాధిచే ఈశ్వరుడుకూడ వేరుగా భాసించును. పరస్పరము జీవులకుగాని, జీవేశ్వరులకుగాని భేదములేదు. ఈభేదమంతయు అజ్ఞానకల్పితము. ఆత్మజ్ఞానముచే అజ్ఞానమును అంతరింపజేసినచో అద్వితీయమగు ఆత్మసాక్షాత్కారమగును. దీనిచే సమస్తక్లేశనివృత్తి కలుగును.

ఈ ఆత్మజ్ఞానోదయమునకు సద్గురువుల సమాశ్రయించి ఉపనిషత్ప్రతిపాదితార్థమును గ్రహించి యుక్తిప్రయుక్తులచే నిర్ధరించుకొని ఏకాంతముగా ఆత్మానుసంధానము

నిరంతరము చేయవలెను. ఇదియే నిదిధ్యాసమని చెప్పబడును. ఈనిదిధ్యాసమువలన ప్రపంచవాసనలెల్ల నశించగా శుద్ధాంతఃకరణములో ఆత్మస్వరూపము గోచరించును.

ఉపనిషత్ ప్రతిపాదితమైన సృష్టిప్రళయములను ఆచార్యులైన శంకర భగవత్పాదుల ధ్యానోపయోగిగా పంచీకరణమను గ్రంధముగా రచించిరి. తత్వజ్ఞానా భ్యాసకుల కీగ్రంధము చాల ముఖ్యమైనది. జ్ఞానాభ్యాస మొకరిసొత్తుగాదు సకలమాన వులకు జన్మసిద్ధమైన హక్కు - అను అభిప్రాయముగల శ్రీ వేంకటకవిగారు దీని ననువ దించిరి కేవలము అనువాదమాత్రమే కాక వేద, వేదాంత, శ్రుతి, స్మృతి, పురాణేతి హాసములను, సాంఖ్యయోగాది శాస్త్రగ్రంధములను పరిశోధించి. పరిశీలించి వేదాంతా భ్యాసకులకు అత్యంతావశ్యకములైన అనేకార్థముల సమకూర్చిరి. సామాన్యులకు, అసామాన్యుల కిది విశేషోపకారకము కాగలదు

ఈగ్రంధమువలె జ్ఞానోపయుక్తములగు ఇతర ఉపనిషదాది గ్రంధములుకూడ శ్రీ వేంకటకవిగారివంటి ప్రాజ్ఞులచే ప్రకాశింపబడినచో తెలుగువారికి పరమసౌభాగ్య మగును పరమేశ్వరు డాస్థితిని అనుగ్రహించుగాక.

పూర్వపక్ష - ఉత్తరపక్షములతో విషయమును వివరించుచు భూషించునది భాష్యము - ఇది స్వతంత్రవిమర్శగా నుండును.

శ్లో॥ సూత్రార్థో వర్ణ్యతే యత్ర, వాక్యై స్సూత్రానుసారిభిః
స్వపదాని చ వర్ణ్యంతే, భాష్యం భాష్యవిదో విదుః.

సూత్రానుసారములగు వాక్యములచే సూత్రార్థమును వర్ణించుచు మధ్యమధ్య గ్రంధకర్త తనసొంతపదములనుగూడ జతపరుచుచు వ్రాయు వ్యాఖ్య భాష్యము. ఈ సంప్రదాయకుల లక్షణోక్తులీభాష్యమునకు సముచితములు.

ఈ పంచీకరణభాష్యమును పదుగురలో ప్రకాశింపజేయ సహకరించిన సద్గుణ సంపన్నులు మాన్యశ్రీ బి.వి ఎస్.ఎస్ మణిగారు నాకు పోషకులు, పరమాప్తులు, సోదరతుల్యులు. వారిని నందించినా, వందించినా పొరకు అన్యథా భావింతురని విర మించుచున్నాను.

ఈ వేంకటకవి వేంకటసూర్యసుబ్రహ్మణ్యము గార్ల కలయిక మణికాంచన సమాగమమని చెప్పవలె. కర్త, స్వీకర్తల సంభావనలు సాఫల్య మందుగాక.

ఇతిశమ్

హైదరాబాదు
31-8-1983

వీరేశ్వర కృష్ణ డోంగరే శాస్త్రి
స్వధర్మస్వారాజ్యసంఘ
ధర్మప్రచారాచార్యులు



శ్రీ బి.వి.ఎస్.ఎస్. మణి          శ్రీమతి లలితారత్నాంబ

స్వధర్మస్వారాజ్య సంఘ నిర్వాహకులు

# సప్తపది

1. అడిగిన నిచ్చు దాతగలఁడా! యని సందియమందువేళ పీ
ఱిడికి నసాత్రదాన మొనరించెడివేళ కరమ్ము చాఁపఁగా
బిడియమునంది మాదృశులు బెగ్గల మందెడివేళ తానుగా
విడియముతోడ విత్తమును వేనకువేలిడె ధర్మరక్షకై.

2. మణీ, కౌతసూర్యనారా
యణరాయ మహోదయుల మహాసంస్థలకున్
మణిగము నెరపఁగ దణియగు
మణీ, యీతఁడు, బులుసువంశమణీ, గుణమణియౌ.

3. కలిమియు, బలిమియు, చెలిమియు
గలిగించుచు వేదవిదుల కన్నాకుగ నీ
నిలువెల్ల రంగరించితి
బులుసు మహావంశసింధు పూర్ణశశాంకా!

4. లలితాంబికా పాదతలముపై పారాణి
సీమంతమునఁ జేర్చు సీమాటి, సౌశీల్య
పతినిదైవముగ సంభావించి సేవించు
పరమపతివ్రతాప్రకరాన తొలిగణ్య!
ధన్యచారిత్ర కౌతా జాతిరతనమ్ము
బులుసువంశప్రతిష్ఠలకెల్ల సదనమ్ము
మతికి సమ్మతిగ సమ్మానించు శీలమ్ము
పుత్రపుత్రిక లహోరాత్రమ్ము భజియింప
సిరిసంపదలు గల్గు వరలక్ష్మి గృహలక్ష్మి
శ్రీలలితారత్న సీమంతినికి సిరుల్
విజయభద్రములు వావిరిగూర్చు పూసరుల్,

5. ప్రోలయవేమన్న ప్రోదిచేసిన నేల
వామనభట్టు దైవాఱు తావు
కాటయవేమన్న కత్తిపట్టినచోటు
కొమరగిరీంద్రుండు కుదురునెలవు
అనవేమసార్వభౌముని విహారస్థలి
శ్రీనాథసుకవి కాలూను వసతి
శంభుదాసుఁడు పదాబ్జములు మోపిన యిక్క
యోగివేమన నిల్చు త్యాగభూమి

అవచితిప్పయ కస్తూరికాది వివిధ
పరిమళద్రవ్య వాసనావాసితమ్ము
కొండవీటిసీమ మనపూర్వు లుండు జాగ
ఆయుపాఖ్యయె సంబంధమాయె మనకు.

6. మాన్యమహోదయుల్ సుకవిమండల మండితు లధ్వరక్రియా
గణ్యులు పుణ్యు లాగమవికస్వరభాస్వర దివ్యదేహ మూ
ర్ధన్యులు ధన్యులౌ బుధసుధార్మికవర్యులు గౌరవింపఁగా
ధన్యతగాంచె, సత్పురుషదత్తము విత్తము నందె భాష్యమున్.

7. మీ గుణగానమునన్ మా
ర్మ్రోఁగున్ దిగ్వ్యూహములు సముజ్జ్వల భాషా
సాగర వేలా పరివృత
భూగోళ కళాప్రవృద్ధ పురుషార్థములై.

— వేంకటకవి

# కృతజ్ఞతలు

దురవగాహనమైన వేదాంతమును సామాన్యమానవుల కెల్లరకు పంచిన వేమన, వీరగురువులవలె వేద, వేదాంతాదులలోని నిగూఢ విషయాలను అక్షరజ్ఞులకెల్ల అందు పాటులో నుంచవలెనని తలఁచి మా కీపని కట్టడిచేసిన శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారి మఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ వీరభోగవసంత వేంకటేశ్వర స్వాములవారికి —

అడిగినదే తడవుగ భాష్యగౌరవమును బహుధా భావించి ముద్రణద్రవ్యమును బహూకరించిన తిరుమలతిరుపతి దేవస్థానగ్రంథ నిర్ణాయక సంఘమువారికి —

అవ్యాజానురాగముగా నన్ను గౌరవపురస్సరముగా అగ్రజునిగా జూచు బ్రహ్మశ్రీ క్రొవ్విడి శ్రీరామనరసింహారావుగారికి —

ఆత్మబంధువుగా నన్ను - అజరామరముగా పంచీకరణభాష్యమును పరికించి ప్రపంచమున కందించిన సద్విద్యాపోషకులు, వదాన్యశిరోమణులగు శ్రీశ్రీ బులుసు వంశమణులగు వేంకటసూర్య సుబ్రహ్మణ్యశర్మగారికి, వీరిసహధర్మచారిణి పూజనీయ లలితారత్నాంబగారికి —

ఈ పంచీకరణ భాష్యమునకు ముఖతిలకము దిద్ది జవము - జీవము చేకూర్చిన విద్వదగ్రేసరులు, మాన్యమహోదయులు, స్వధర్మస్వారాజ్య సంఘధర్మప్రచారా చార్యులు బ్రహ్మశ్రీ వీరేశ్వరకృష్ణ దోంగ్రేశాస్త్రులవారికి—

ముచ్చటగా ముద్రణ గావించి మెప్పించిన క్రాంతిప్రెస్ శ్రీ ధనికొండ శ్రీధరరావుగారికి —

— వేంకటకవి

# విషయసూచిక

ఓమ్

# పంచీకరణ భాష్యము

## గురుస్తుతి

గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణుః గురుర్దేవ స్సదాశివః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః.

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః.

అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః.

చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం స చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః.

మన్నాధః శ్రీ జగన్నాధో మద్గురు శ్శ్రీ జగద్గురుః
మహాత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీ గురవే నమః.

బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్.
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

యస్మా జ్జాతం జగత్సర్వం యస్మి న్నేవవిలీయతే
యేనేదం ధార్యతే చైవ తస్మై జ్ఞానాత్మనే నమః.

యత స్సర్వాణి భూతాని ప్రతిభాంతి స్థితాని చ
యత్రైవోపశమం యాంతి తస్మై సత్యాత్మనే నమః.

ధైర్యైరావత శాంతిధేను దమ సన్మందార బంధూన్సదా
మైత్ర్యా దప్సరసో వివేకతురగం సంతోష చింతామణిమ్
ఆత్మజ్ఞాన మహామృతం సమరసం వైరాగ్యచంద్రోదయమ్
వేదాంతార్ణవ మాశ్రయా మ్యనుదినం శ్రేయస్స్వముక్తిప్రదమ్.

# పంచీకరణమ్

## శ్రీ శ్రీ శ్రీ శంకర భగవత్పాద విరచితమ్

అథాతః పరమహంసానాం సమాధి విధిం వ్యాఖ్యాస్యామః.

టీక. అథ = తరువాత, అతః = కర్మవైరాగ్యానంతరము [అనఁగా కర్మకాండల నాచరించిన పిదప] పరమహంసానాం = సన్న్యాసి శ్రేష్ఠులగు పరమహంసల నుద్దేశించి, సమాధివిధిం = సమాధియనెడి యోగవిధిని గూర్చి, వ్యాఖ్యాస్యామః = వివరణము చేయఁగలము—

భాష్యము. ఇందుఁగల అథాతశ్శబ్దములకు జ్ఞానమార్గమునకు ముందుగల కర్మకాండ యందలి ఆచరణ తరువాత యని చెప్పనొప్పును. లేదా - వేదశాస్త్రముల యందు మంగళము కొఱకు - ఆది మధ్యాంతముల యందు మంగళ సూచక పదములను వాడవలెనను నియమముగలదు ఆ నియమము నాశ్రయించి ఇట మంగళకరమైన అథ, అతః అను శబ్దద్వయము నుపయోగించిరనియైనను చెప్పనొప్పును. ఇట్లే బ్రహ్మసూత్రమందలి తొలి సూత్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనుట గమనార్హము.

సమాధి: 1. యమ - 2. నియమ - 3. ఆసన - 4. ప్రాణాయామ - 5. ప్రత్యాహార - 6. ధ్యాన - 7. ధారణ - 8. సమాధులని యోగశాస్త్రమున మోక్షము నందుట కెనిమిది సోపానముల నేర్పఱచిరి, అందు తుదిది సమాధి - సమాధి అనఁగా పరబ్రహ్మముతో తాదాత్మ్యాది భావముతో నుండుట

పరమహంస: 1. బహూదకులు - 2. కుటీచకులు - 3. హంస - 4. పరమహంస లని యతీశ్వరులు నాల్గురకములు, అందు పరమహంస లనఁగా భగవంతుని చేరుటకతి సమీపమున నున్నవారని - పంచప్రాణములు తమ స్వాధీనమందున్న వారని భావము.

సచ్ఛబ్దవాచ్య మవిద్యా శబలం బ్రహ్మణోఽవ్యక్తం - అవ్యక్తాన్మహత్ - మహతోఽహంకారః - అహంకారాత్ పంచతన్మాత్రాణి - పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని - పంచమహాభూతేభ్యోఽఖిలం జగత్ -

టీక. బ్రహ్మణః = బ్రహ్మపదార్థమునుండి, సచ్ఛబ్ద వాచ్యం = కలదు అనెడి పదము చేతనే వ్యవహరింపఁబడునట్టిదియు, అవిద్యాశబలం = అవిద్యతో కలిసినట్టిదియు నగు, అవ్యక్తం = అవ్యక్తమనెడి తత్త్వము పుట్టినది - అవ్యక్తాత్ = అవ్యక్తమునుండి, మహత్ = మహత్తత్త్వము జనించినది, మహతః = మహత్తత్వమునుండి, అహంకారః = అహంకార మావిర్భవించినది, అహంకారాత్ = అహంకారమునుండి, పంచ తన్మాత్రాణి = శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను తన్మాత్రలు పుట్టినవి. పంచ తన్మాత్రేభ్యః = ఈ పంచతన్మాత్రల నుండి, పంచమహాభూతాని=పృధివ్యప్తేజో వాయు రాకాశములను పంచమహాభూతము లుద్భవించెను. పంచమహాభూతేభ్యః = ఈ పంచ మహాభూతములనుండి, అఖిలం=సమస్తమైన, జగత్=ప్రపంచము సంభవించునది.

భాష్యము: పంచమహాభూతముల మూలకారణ సూక్ష్మరూపములే పంచతన్మాత్రలు - అహంకారము ఇట అహంకారమనఁగా గర్వపర్యాయమైన అహంకారముగాక పంచ వింశతి మహాతత్వములకుఁ గారణభూత తత్త్వమని గుర్తింపవలెను.

పంచానాం భూతానా మేకైకం ద్విధా విభజ్య స్వార్థభాగం విహాయార్థభాగం చతుర్ధా విభజ్యేతరేషు యోజతే పంచీకృత పంచీకరణం మాయారూపదర్శన మధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే.

టీక: పంచనాంభూతానాం = ఐదు భూతములలో, ఏకైకం = ఒక్కొ-క్క- దానిని, ద్విధా = రెండుగా, విభజ్య = విభజించి, స్వార్థభాగం = ఒక్కొ-క్క-దాని యందలి సగపాలును, విహాయ = వదలి, అర్ధభాగం = మిగిలిన సగపాలును, చతుర్ధా = నాల్గు రీతులుగా, విభజ్య = విభజించి, ఇతరేషు = మిగిలినవానియందు, యోజతే = కూర్పఁ బడుచున్నది - పంచీకృత = ఐదుగాఁ జేయఁబడిన, పంచీకరణం = పంచీకరణపద్ధతి, మాయారూపదర్శనం=మిథ్యారూపమైన ప్రపంచమును ప్రదర్శించునట్టిదియు, నిష్ప్రపంచం = ప్రపంచము లేనట్టిదియునైన. బ్రహ్మపదార్థమును, అధ్యారోప + అపవాదాభ్యాం = ఆరోప, అపవాదముల మూలమున, ప్రపంచ్యతే = నిరూపింపఁబడు చున్నది.

భాష్యము. అధ్యారోపమునే అధ్యాసమనియు నందురు. మిథ్యాజ్ఞానమని యర్థము. ఒకటిని మఱొక్క-టిగాఁ దలఁచుట. ఒక ధర్మి యందలి ధర్మమునందు మఱియొక ధర్మము నుగాని - ధర్మినిగాని చెప్పుట ఆరోపము__

అపవాదము: సామాన్య విధిని బాధించి విశేషవిధిని విధించునది అపవాదము. "మాహింస్యాత్సర్వాభూతాని" ఏ జంతువును హింసింపరాదను హింసా నిషేధవిధి సామాన్యశాస్త్రము. "వాయవ్యం శ్వేతమాలభేత" వాయుదేవతాకమగు శ్వేత పశువును హింసింపవలయును - అనునది విశేష శాస్త్రము ఇది వాయవ్య పశువును దక్క మిగిలిన పశువుల చంపఁగూడదని సామాన్యశాస్త్రమున కర్థమును గల్పించును.

ఓమ్ పంచీకృత పంచ మహాభూతాని తత్ కార్యంచ సర్వం విరాడిత్యుచ్యతే ఏతత్ స్థూలశరీర మాత్మనః ఇంద్రియైరర్థోపలబ్ధి ర్జాగరితం తదుభయాభిమాన్యాత్మా విశ్వః ఏతత్త్రయ మకారః -

టీక ఓమ్ = పరబ్రహ్మరూపమైన ఓంకారతత్త్వము నిరూపింపఁబడుచున్నదని భావము, పంచీకృత = ఐదుగాఁ జేయఁబడిన, పంచమహాభూతాని = పృధివ్యాదిభూతములు, తత్కార్యంచ = ఆ పృధివ్యాదిభూతములవలన నేర్పడిన స్థావరజంగమాత్మకము - కార్యరూపమునైన ప్రపంచము, సర్వం = అంతయు, విరాట్ = విరాట్పురుషుఁడు, ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, ఏతత్ = ఈ భూత పంచకమువలన నేర్పడిన, స్థూలశరీరం = స్థూలశరీరము, ఆత్మనః = పరమాత్మకు, ఇంద్రియైః = చక్షురాదీంద్రియమువలనఁ గలుగు, అర్థోపలబ్ధిః = రూపాదివిషయజ్ఞానమే, జాగరితం = జాగ్రదవస్థ యగుచున్నది, తదుభయాభిమాన్యాత్మా = స్థూలశరీరమందు-జాగ్రదవస్థయందు నేనను భావము గల జీవుఁడే, విశ్వః = విశ్వుఁడనఁబడును, ఏతత్త్రియం = స్థూలశరీరము - జాగ్రదవస్థ - విశ్వుఁడను పేరు గల జీవుఁడు అను ఈ మూడును గలిపి, అకారః = అకారము.

అపంచీకృత పంచమహాభూతాని, పంచతన్మాత్రాణి, తత్కార్యంచ పంచప్రాణాః దశేంద్రియాణి మనోబుద్ధిశ్చేతి సప్తదశకం లింగం భౌతికం హిరణ్యగర్భ ఇత్యుచ్యతే - ఏతత్ సూక్ష్మ శరీర మాత్మనః - కరణేషూపసంహృతేషు జాగరిత సంస్కారజః ప్రత్యయః సవిషయః స్వప్న ఇత్యుచ్యతే-తదుభయాభిమాన్యాత్మా తైజసః - ఏతత్త్రయ ముకారః -

టీక: అపంచీకృత = అయిదుగా విభజింపఁబడని, పంచమహాభూతాని = పృథివ్యాది పంచమహాభూతములు, పంచతన్మాత్రాణి = తన్మాత్రలైదు, తత్కార్యంచ = వాని కార్యము, పంచప్రాణాః = ప్రాణ, వ్యాన, సమాన, ఉదాన, అపానములను నైదును, దశేంద్రియాణి = కర్మజ్ఞానేంద్రియములు పదియు, మనః = మనస్సు, బుద్ధిశ్చ = బుద్ధియు, ఇతి = అనెడి, సప్తదశకం = పదునేడును, లింగం = లింగ శరీరము, భౌతికం = భూతకార్యములైన ప్రాణాదులచే నిర్మింపఁబడిన ఇది, హిరణ్యగర్భః = హిరణ్యగర్భుఁడని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, ఆత్మనః=పరమాత్మకు, ఏతత్ = ఇదియే, సూక్ష్మశరీరం = సూక్ష్మశరీరము. కరణేషు = ఇంద్రియములు, ఉపసంహృతేషు = తమతమ వ్యాపారముల నుండి మరలియుండఁగా, జాగరితసంస్కారజః = జాగ్రదవస్థయందలి సంస్కారము వలనఁ బుట్టినదియు, సవిషయః = విషయముతోఁ గూడినదియునైన, ప్రత్యయః = దృఢమైన అనుభూతియే, స్వప్నః = కల, ఇతి = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. తదుభయాభిమాన్యాత్మా = ఆ సూక్ష్మశరీరమందు-స్వప్న శరీరమందు నేనే అను కర్తృభావముతోఁ గూడిన జీవుఁడే, తైజసః = తైజసుఁడనఁబడును, ఏతత్రయం = ఈ లింగ శరీరము - స్వప్నము - తైజసుఁడను మూడును - ఉకారః = ఉకారము.

శరీరద్వయ కారణ మాత్మాజ్ఞానం సాభాసమవ్యాకృత మిత్యుచ్యతే. ఏతత్కారణ శరీర మాత్మనః - తచ్చ సన్నాసన్నపి - సదసత్తన్నభిన్నన్నాభిన్నన్నాపి భిన్నాభిన్నం కుతశ్చిత్. న నిరవయవం, న సావయవం, నోభయం, కింతు కేవలబ్రహ్మాత్మైకత్వ జ్ఞానాపనోద్యం, సర్వప్రకార జ్ఞానోపసంహారో బుద్ధేః కారణాత్మనావస్థానం సుషుప్తిః - తదుభయాభిమాన్యాత్మా ప్రాజ్ఞః - ఏతత్త్రయ మ్మకారః -

టీక. శరీర ద్వయకారణం = స్థూల సూక్ష్మ శరీరములకుఁ గారణము, ఆత్మాజ్ఞానం = పరమాత్మ యొక్క యథార్థ జ్ఞానము లేకపోవుటయే - ఇది - సాభాసం = ఆభాసతోఁ గూడినది, అవ్యాకృతం = వివరణలేనట్టిది, ఇతి=అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, ఏతత్ = ఇదియే అనఁగా ఈ అజ్ఞానమే, ఆత్మనః = ఆత్మకు, కారణ శరీరం=కారణ శరీరమని పిలువఁబడును, తచ్చ=ఆ కారణశరీరము, సన్న=ఉన్నదని నిశ్చయముగాఁ

జెప్పుటకు వీలులేనిది, అసన్న = లేదని చెప్పుటకు వీలులేనట్టిది, సదసన్న=ఉండియు లేనిదికాదు, భిన్నంన = భిన్నమైనదిగాదు, అభిన్నంన = అభిన్నమైనది కాదు, భిన్నాభిన్నంన = భిన్నాభిన్నమును గాదు, కుతశ్చిత్ = ఏకారణము వలనను, నిరవయవం = అవయవములు లేనట్టిది, సావయవం = అవయవములతోఁ గూడినట్టిది, న = కాదు, కింతు = మఱెట్టిదనిన, కేవల బ్రహ్మాత్మైకజ్ఞానాపనోద్యం = కేవలము పరబ్రహ్మమే నేనను స్వానుభూతిచేత మాత్రమే తొలఁగింపఁబడునది అగుచున్నది, బుద్ధేః = బుద్ధి యొక్క, సర్వప్రకార జ్ఞానోపసంహారః=అన్ని విధములైన విషయ జ్ఞానము సమసించిపోవుట, కారణాత్మనా=కారణరూపముగా, అవస్థానం=ఉండుటయే, సుషుప్తిః=సుషుప్త్యవస్థ అని పిలవఁబడును, తదుభయాభిమానీ=ఆ కారణసుషుప్తుల రెంటియందును నేనను అభిమానముగల, ఆత్మా = జీవుఁడే, ప్రాజ్ఞః = ప్రాజ్ఞుఁడనఁ బడును ఏతత్=ఈ, త్రయం=మూడును, మకారః=మకారము.

అకార ఉకారే - ఉకారో మకారే - మకార ఓంకారే - ఓంకారో౽హమేవ. అహమాత్మా సాక్షీ కేవల శ్చిన్మాత్ర స్వరూపః -

టీక. అకారః=అకారము, ఉకారే=ఉకారమునందుఁగలదు. ఉకారః=ఈ ఉకారము, మకారే=మకారమందుఁగలదు మకారః=ఈ మకారము, ఓంకారే=ఓంకారమునందుఁ గలదు, ఓంకారః=తుదకు మిగిలిన ఓంకారము, అహమేవ=నేనే, అహం=నేననఁగా, ఆత్మా = పరమాత్మను, సాక్షీ = సర్వ వ్యవహారములకు సాక్షిభూతుఁడను, కేవలః= అద్వితీయుఁడను, చిన్మాత్ర స్వరూపః=జ్ఞానస్వరూపుఁడను నేనేగాని వేఱు గాదు.

కింతు నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య స్వభావం పరమానందాద్వయం ప్రత్యగ్భూత చైతన్యం బ్రహ్మైవాహమస్మీ త్యభేదే నావస్థానం సమాధిః -

టీక. కింతు = మఱియు, నిత్య = శాశ్వతమైనదియు, బుద్ధ = తెలియఁబడినదియు, ముక్త=మోక్షదాయకమైనదియు, సత్యస్వభావం=సత్యమే స్వభావముగాఁగలదియు, పరమా + ఆనంద + అద్వయం = కేవలమానందము తప్ప మఱేమి లేనిదియు, ప్రత్యగ్భూత=ప్రత్యగ్భూతమును, చైతన్యం = చిత్స్వరూపమగు పరమాత్మయునైన,

బ్రహ్మైవ=బ్రహ్మమే, అహమస్మి=నేనై యున్నాఁడను - ఇతి=అని, అభేదేన = తాదాత్మ్యభావముతోఁ, అవస్థానం = ఉండుటయే, సమాధిః = సమాధియనఁబడును.

"తత్త్వమసి" "బ్రహ్మాఽహ మస్మి" "ప్రజ్ఞాన మానందం బ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది శ్రుతిభ్యః – ఇతి పంచీకరణం భవతి –

ఓమ్ – ఇతి శమ్ –

ఇతి శ్రీశంకర భగవత్పాద విరచితమ్ పంచీకరణమ్ సమాప్తమ్

టీక: తత్ + త్వం + అసి=ఆ బ్రహ్మము నీవై యున్నావు. బ్రహ్మాఽహమస్మి= నేనే పరబ్రహ్మమును-ప్రజ్ఞానం=జ్ఞానము, ఆనందం = కేవలానందము, బ్రహ్మ = పరబ్రహ్మము - అయమాత్మా=ఈ జీవాత్మయే, బ్రహ్మ=బ్రహ్మపదార్థము - ఇత్యాది=ఇవి మొదలగు, శ్రుతిభ్యః=వేదములవలన పై అర్థము స్ఫుటమై సమన్వయము కుదురు చున్నదని భావము - ఇతి = ఈ రీతిగా, పంచీకరణం = పంచీకరణము, భవతి = అగుచున్నది -

— శ్రీశ్రీశ్రీ శంకరాచార్య కృత పంచీకరణము సమాప్తము —

# పంచీకరణ భాష్యము

ఆద్యంతరహిత నిర్గుణ నిర్వికల్ప పరబ్రహ్మమునందు అవ్యక్త తమస్సయిన [1]మూలప్రకృతి సర్వే సర్వత్ర వ్యాపించి సంకల్ప రూపంబుగా నొక మహత్తత్త్వంబు గలిగెను.

భాష్యము. బ్రహ్మణస్సకాశాత్ నానా విచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యైక బుద్ధిరూప బ్రహ్మశక్తి రేవ ప్రకృతిః. (శ్రుతి)

తా॥ కర్మబీజమే ప్రకృతి యనఁబడును అచేతనమైన ప్రకృతియందు ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యమే సృష్టికారణమగుచున్నది. ఇదియే జగత్సర్జన సామర్థ్యమను బ్రహ్మబుద్ధియై మహత్తత్త్వ మనఁబడును.

శ్లో॥ అవ్యక్తా ప్రకృతిర్మూలా॥ త్వపరా త్రిగుణాత్మికా
అవ్యక్తం హి పరబ్రహ్మ యతస్సర్వైర్నవ్యజ్యత
[స్కాందము - తత్త్వసంహిత]

అవ్యక్తము రెండు విధములు. మొదటిది మూలప్రకృతిరూపము. రెండవది పరబ్రహ్మరూపము. పరబ్రహ్మ మెందు కవ్యక్తమైనదనఁగా అందఱకుఁ గనిపించ నందున - మూలప్రకృతి, పరబ్రహ్మము రెండును అవ్యక్తస్వరూపములె - "అసద్వా ఇద మగ్ర ఆసీత్" [తైత్తిరీయము 2 అధ్యాయము - 7 అనువాకము] శూన్యము నుండియే ప్రకృతియు - ఈశ్వరుఁడును పుట్టినట్లును - "తతోవై సదజాయత తదాత్మానం స్వయమకురుత" సత్య - జ్ఞాన - అనంతరూపమైన ఆత్మ పుట్టినట్లును ఆగమములు ఘోషించుచున్నవి ఇదియే ఆద్యంతరహిత నిర్గుణ నిర్వికల్ప పరబ్రహ్మ స్వరూపమని పెద్దలు వాకొనిరి.

ఈ విశ్వమే కారణరూపమున అవ్యక్తమై ఇంద్రియముల కగమ్యమై అక్షర మగునపుడు 1. మూలప్రకృతి - 2 ప్రధానము - 3 అవ్యక్తమని పిలువఁబడును. ప్రకృతి పరిణమించునట్టిది. మహదహంకారాది రూపములలో స్థూలతను పొందు యోగ్యత ప్రకృతికిఁ గలదు "మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త - షోడశస్తు వికారాః - న ప్రకృతిర్నవికృతిః పురుషః - [సాంఖ్యకారికలు]

[1]మహత్తత్త్వంబునందు అధిష్ఠానశక్తి వలన మహదహంకారము గలిగెను. ఈ మహదహంకారము నందు సత్వ రజస్తమోత్మకంబైన [2]మహామాయ కలిగెను.

మూలప్రకృతి వికృతికాదు. మహత్తు - అహంకారము - తన్మాత్రలైదు - ఈ ఏడును ప్రకృతివికృతులు. దశేంద్రియములు, పంచభూతములు - మనస్సు - అను పదునారును వికృతులే. అధిష్ఠాన పురుషుఁడు మాత్రము ప్రకృతిగాదు - వికృతిగాదు -

భాష్యము 1. 'ఈ మహత్తత్త్వము లేనిచో జీవులు శరీరధారణకు సమర్థములుగావు. ఈ మహత్తత్త్వము నుండి అహంకారము గలిగి మహదహంకార మాయెను.

పరమేశ్వరుఁడు అవ్యక్త మూలప్రకృతి నుండి మహత్త్వాది కార్యపదార్థములను సృష్టించి వానితో తను నావరించుకొనును. ప్రపంచము సృష్టించి దానిలో తాను వ్యాపించియుండు నని భావము -

2. "మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం
తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్."

[శ్వేతాశ్వతరోపనిషత్ 4 - 10]

తా. మాయాశక్తిని ప్రకృతిగాను మాయోపాధికుఁడగు మహేశ్వరుని సృష్టికర్తగాను గుర్తింపుము. ఆ మహేశ్వరుని ప్రకృతి సంయుక్తములగు అవయవములతో ఈ జగత్తంతయు వ్యాపించియున్నది.

శ్లో॥ మహామాయా మహాలక్ష్మీ ర్మహాదేవీ సరస్వతీ
ఆధారశక్తి రవ్యక్తా యయా విశ్వం ప్రవర్తతే

[యోగశిఖోపనిషత్]

తా॥ ఈ సమస్త ప్రపంచ మెవరిచే వ్యాపింపఁబడి యున్నదో ఆమెయే మహామాయ - ఆమెయే మహాలక్ష్మి - ఆమెయే మహాదేవి - ఆమెయే సరస్వతి - అవ్యక్తమును ఆమెయే. చక్షురాదీంద్రియములచేఁ దెలియఁ దగినదివ్యక్తము. తెలియరానిది అవ్యక్తము.

ఆ మహామాయ వలన మాయాశబలిత బ్రహ్మము కలిగెను. ఆ మాయాశబలిత బ్రహ్మమందు ప్రణవరూపమైన ఓంకారము గలిగెను.

శ్లో॥ శుద్ధ సత్వవిశుద్ధాభ్యాం మాయాఽవిద్యేచ తే మతే
మాయా బింబోవశీకృత్యతాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః.

తా॥ శుద్ధ సత్వముచే మాయ యనియు - మలిన సత్వముచే అవిద్య యనియు ప్రకృతి రెండు విధము లగును. మాయ యందు ప్రతిఫలించిన చిదాత్ముఁడు ఆ మాయను స్వాధీనము చేసికొని సర్వజ్ఞత్వాది గుణములతో సర్వేశ్వరుఁ డనఁబడుచున్నాఁడు

భాష్యము 1. శబలమనఁగా చిత్రవర్ణము మాయచే చిత్రవర్ణముగా చేయఁబడినది - మాయతోఁ గూడిన ఈశ్వరుఁడును, అవిద్యతోఁ గూడిన జీవుఁడును-అను నీ రెండును వాచ్యము లగును. ఇచట మాయతోఁ గూడిన ఈశ్వరుఁడని యర్థము.

2. ఓంకార ప్రభవా వేదాః ఓంకార ప్రభవాస్స్వరాః
ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్.

[ధ్యానబిందోపనిషత్]

ఓంకారము వేదములయొక్క సారభూతము ఉపనిషత్తులు దీని మహిమను గానము చేయుచున్నవి. యోగాది శాస్త్రములు దీని నుపాసించుచున్నవి బ్రాహ్మణ గ్రంథములును, శ్రుతిస్మృతులును, భగవద్గీతలును దీనిని ప్రశంసించుచున్నవి. వైదిక-లౌకిక వాఙ్మయము లందంతట దీని మహిమ గలదు.

మంత్రరాజములకెల్ల ప్రణవము శిరోమణి. తొలుత ఓంకారముతో పలుకని మంత్రము నిష్ప్రయోజనము, నిరర్థకము కనుక ప్రణవమును ఉద్గీథ యందురు. ప్రణవము, ఓంకారము, ఉద్గీథము, ఏకాక్షరము, తారకము, శబ్దబ్రహ్మమనియు దీనికి నామాంతరములు—

మంత్రము: ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత. [ఛాందోగ్యము-1-1-1]

తా॥ ఉద్గీథమను నామము గల ఈ నాశరహిత మగు ఓంకారమునే ఉపాసింపవలెను.

మంత్రము నక్షరతి, ననంచలతి, నవినశ్యతి, ఇత్యక్షరం బ్రహ్మ—

తా॥ క్షరము గానిది, చలింపనిది, నాశనము లేనిది యగు ఓమను అక్షర పర బ్రహ్మమునే ఉపాసింపవలెను. దీనిని సామవేదులు ఉద్గీథమని - ఋగ్వేదులు ప్రణవ మని యందురు.

పరమేశ్వరుని యితర పేరులవలెఁ గాక యిది అవ్యయము, నాశరహితము, ఏకాక్షరము, లింగ - విభక్తి - వచనరహితము, సర్వ గర్భము, అతి గంభీరము, సమస్త బ్రహ్మాండ భాండములును దీనియం దిమిడి యున్నవి. ఈ ఓంకారము నందలి మూడక్షరములు ప్రపంచ మందలి సర్వత్రిపుటలకు మూలమై యున్నవి.

1. అకారము = విరాట్టు, అగ్ని, విశ్వాదులు—

2 ఉకారము = హిరణ్యగర్భుడు, వాయువు, తైజసాదికములు.

3. మకారము = ఈశ్వరుఁడు, ఆదిత్యుఁడు, ప్రాజ్ఞాదికములు.

అ, ఉ, మకారముల సంయోగముచే ఓంకారము గలుగుచున్నది. అకారమునకు ఉకారము పరము కాఁగా గుణము వచ్చి అనఁగా గుణసంధి యేర్పడి ఓకారమై ముందున్న మకారముతోఁ గూడి "ఓమ్" అను ప్రణవమగుచున్నది పంచాక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి మొదలగు మంత్రముల మొదట ఓంకారము నుచ్చరింతురు.

ఓంకారమునందలి ఏకమాత్రోపాసన (అకారము) వలన భూసంపద - ద్విమాత్రోపాసన (అకార ఉకారములు) వలన చంద్రుని సౌమ్యశీలత - త్రిమాత్రోపాసన (అ,ఉ,మ్) వలన సూర్యుని తేజః ప్రాప్తి జ్ఞానసంపద కలుగునని శ్రుతి ప్రమాణము. పరికింపుఁడు—

మంత్రము "సయద్యేకమాత్ర మభిధ్యాయీత - సతేనైవ సంవేదిత స్తూర్ణమేవ జగత్యా మభిసంపద్యతే తం ఋచో మనుష్యలోక ముపనయంతే, సతత్ర తపసా బ్రహ్మచర్యేణ - శ్రద్ధయా సంపన్నో మహిమాన మనుభవతి"

[ప్రశ్నోపనిషత్ -5-ప్రశ్నము-3-మంత్రము]

తా॥ ఎవఁడు ఓంకారము నందలి యేకమాత్రయగు అకారమును ధ్యానించునో అతఁడు జ్ఞానియై వెంటనే లోకసంపన్నుఁ డగును. ఋక్కు లతనిని మనుష్యలోకము పొందించును. తపస్సు, బ్రహ్మచర్యము శ్రద్ధలతో మహిమ నందును.

మంత్రము: అధయదిద్విమాత్రేణ మనసి సంపద్యతే సోఽన్తరిక్షం యజుర్భి రున్నీయతే సోమలోకం, ససోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే.

[ప్రశ్నోపనిషత్-5ప్రశ్నము-4-మంత్రము]

తా॥ ఎవఁడు అ-ఉ-అనెడి ద్విమాత్రలను మనోనిశ్చలతతో ధ్యానించునో అతఁడు యజస్సుల మూలమున చంద్రలోకమును పొందును ఆ లోక భోగము ననుభవించి తిరిగివచ్చును.

మంత్రము యః పునరేతత్త్రి మాత్రేణైవ ఓమిత్యనే నైవాక్షరేణ పరంపురుషమధ్యాయీత, సతేజసి సూర్యే సంపన్నః— [ప్రశ్నోపనిషత్-5-5]

తా॥ ఎవఁడీ అ.ఉ.మ - త్రిమాత్రాత్మకమగు ఓంకారముతో పరిపూర్ణ పరబ్రహ్మము నుపాసించునో అతఁడు కాంతిమంతమగు సూర్యలోకమునందు విశేష శక్తియుక్తుఁ డగును. ప్రణవోపాసనచే పవిత్రుఁ డగును.

| | | | | |
|---|---|---|---|---|
| జాగ్రత్త | అకారము | విశ్వుఁడు | అవిద్యాపాదము | బ్రహ్మవిత్ |
| స్వప్నము | ఉకారము | తైజసుఁడు | విద్యాపాదము | బ్రహ్మవిద్వరుఁడు |
| సుషుప్తి | మకారము | ప్రాజ్ఞుఁడు | ఆనందపాదము | బ్రహ్మవిద్వరీయుడు |
| తురీయము | అర్ధమాత్ర | తురీయుఁడు | తురీయపాదము | బ్రహ్మవిద్వరిష్ఠుఁడు |

జాగ్రత్స్వప్న సుషుప్తులు లేనిది తురీయావస్థ.

శ్లో॥ పరబ్రహ్మవదాభాతి నిర్వికారైకరూపిణీ
సర్వావస్థాసు ధారైకా తుర్యాఖ్యా పరికీర్తితా.

[నారదపరివ్రాజకోపనిషత్]

భాష్యము జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థల యందును వికారరహితమైన స్వరూపము గలదియు, పరమాత్మవలె ఒక్కటే యైనదియు నగు ఏ ధార గలదో అది తురీయమని చెప్పఁబడును.

సోఽహం - అనఁబడు సకారము మీఁదటి స్వరము ఓకారము - హకారము మీఁదటి స్వరము పూర్ణానుస్వారము. ఈ రెండు చేరి ఓంకార మాయెను హంస యనఁగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు - ఇదే ప్రాణము. దేహమునుండ దేహాంతరమునకు

నైతమిదే నడిపించును. అందువలననే "హన్తిగచ్ఛతి దేహాద్దేహాంతర మితి హంసః" అని వ్యుత్పత్తిని దెలిపిరి ఇది ఓంకారములో అంతర్లీనమై యున్నది.

శ్లో॥ త్రయోదేవా స్త్రయోవేదా స్త్రయోలోకా స్త్రయోగుణాః
ఓమిత్యేకాక్షరే మంత్రే పరేబ్రహ్మణి సంతివై.

[శ్రీదత్తాత్రేయకృత రాజయోగ సామ్రాజ్యము]

భాష్యము: ఓమనెడి ఏకాక్షర మంత్రమైన పరబ్రహ్మమునందు హరి, హర, హిరణ్య గర్భులను మూవురు దేవతలును, ఋగ్యజుస్సామములను మూడు వేదములును, సత్వరజస్తమములను మూడు గుణములును గలవు.

శ్లో॥ అకారంచా ప్యుకారంచ మకారంచ ప్రజాపతిః
వేదత్రయా న్నిరదుహద్ భూర్భువ స్స్వరతీతిచ.

[మనుస్మృతి]

మంత్రము' తస్యవాచకః ప్రణవః తజ్జప స్తదర్థభావనమ్.

[పతంజలి యోగశాస్త్రము]

భాష్యము. ఆ సర్వేశ్వరునకు వాచకము ప్రణవము. జపించుట, తదర్థమును భావించుట ముఖ్యము - అకారముతో సర్వేశ్వరుని జగద్వ్యాపకత్వమును, ఉకారముతో నతని జగత్పోషకత్వమును, మకారముతో నతని ఆనందాది యథార్థరూపమును ఉపాసించి ఉపాసకుఁడు ముక్తుఁ డగును.

శ్లో॥ ప్రణవోధను - శ్శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్.

[ముండకోపనిషత్-2-2-4]

తా. ఓంకారము ధనుస్సుగాను - మనస్సును బాణముగాఁజేసి జాగరూకుఁడై బ్రహ్మమను లక్ష్యమును గొట్టఁగా బాణమువలె మనసు తన్మయమగును. అనఁగా మనసు బ్రహ్మాకారమగును.

## త్రివిధ వర్ణములు - అ, ఉ, మ.

1. అకారము—సృష్టి, పురుషబీజము, నాదము, విష్ణువధిదేవత, నేత్రస్థానము, విశ్వుఁడు, జాగ్రదవస్థ—

ఓంకారరూప బ్రహ్మమైన శబ్ద తన్మాత్రయందు ఆకాశము గలిగెను - ఆకాశమునందు స్పర్శతన్మాత్రమున వాయువు కలిగెను.

2 ఉకారము—స్థితి, ప్రకృతి బీజము, బిందువు, బ్రహ్మ అధిదేవత, కంఠస్థానము తైజసుఁడు, స్వప్నావస్థ—

3. మకారము—లయము, జీవుఁడు, కళ, రుద్రుఁ డధిదేవత, హృదయ స్థానము, ప్రాజ్ఞుఁడు, సుషుప్త్యవస్థ—

## నాద - బిందు - కళలు

1. నాదము. ఓంకారము - లేక శబ్దగుణము. పరా - పశ్యంతీ - మధ్యమ అను వాక్కు నాడులందు వాయువు సంచరించునపుడు కలుగునట్టి ధ్వని రేచక, పూరక, కుంభకాదులవలనఁ బుట్టిన వాయువు లయమగు వఱకు ఆ నాదముండును. నాదము నిరాలంబమైన బ్రహ్మమందు లయ మగును. రేచక, పూరక, కుంభకాదులవలన సంభవించిన వాయువు మనస్సంబంధమైనది మనస్సును వృత్తిరహితముగాఁ జేసినచో ఆ వాయువు వెంటనే లయమగును.

2. బిందువు. ఓంకారముయొక్క అలక్ష్యార్థ రూపమైన తురీయపదము. మనస్సున కగ్రమందుండునదియే బుద్ధి - అదే బిందువనఁబడును. ఇదే జాగ్రదవస్థయందు బుద్ధియని, సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియ లయస్థానమైన అజ్ఞానమనియును వ్యవహరింపఁబడును.

3. కళ. ఓంకారము యొక్క అకారాదిమాత్రయగు - పరా అను వాక్కుయొక్క అంశము. ఇది శబ్దావయవము - బుద్ధియందు ప్రకాశించునట్టి పరబ్రహ్మ ప్రతిబింబము కళ యనఁబడును - అదియే చిత్కళ—

శ్లో॥ మనోఽగ్రే వసతే బిందుః ప్రాణాగ్రే వసతేకళా
ఉభయో ర్లీయతే నాదం లయ ఇత్యుచ్యతే బుధైః.

తా. మనస్సున కగ్రముగా నుండునది బిందువు అనఁబడు బుద్ధి - ప్రాణమున కగ్రముగా నుండునది కళ - ఈ బిందువును, కళయును లీనమైనపుడే నాదము లయమగును. ఇట్టి నిష్కళయే పరమాత్మ స్వరూపము.

వాయువు నందు రూపతన్మాత్రంబున అగ్ని కలిగెను - అగ్నియందు రసతన్మాత్రమున జలము కలిగెను - జలమునందు గంధతన్మాత్రమున భూమి కలిగెను.

భూమియం దోషధులు - ఓషధులం [1]దన్నము - అన్నరసము వలన [2]శుక్ల శోణితములు, తన్మూలమున నర, మృగ. పక్షి, స్థావర, జంగమాదు లగు చరాచర ప్రకృతి సంభవించెను. ఈ పంచమహా భూతములతోఁ గూడినదే మహా ప్రపంచ మాయెను.

జలభూత సంభవములైన పంచతన్మాత్రలే ప్రపంచ సృష్టికి కారణభూతము లాయెను.

# 1. అన్నప్రాశస్త్యము:

ఋగ్వేదమునందలి భాగములం దెల్లెడల యజ్ఞములు గావించుట, వాని మూలమున వర్షములు వచ్చుట, వానిద్వారమున ఓషధులు ఫలించి యన్నము నొసఁగుట, ఇంద్రాగ్ని వరుణాదుల పూజించుట కలదు. అన్నప్రాశస్త్యము వేదములం దెల్లెడలఁ గలదు.

మంత్రము: "అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే యాః కాశ్చ పృథివీంశ్రితాః"

[తైత్తిరీయోపనిషత్ - ద్వితీయానువాకము.]

టీక: పృథివీంశ్రితాః = ఈ నేల నంటఁగొని, యాఃకాఃచప్రజాః = ఏయే జీవులు గలవో అవియన్నియు, అన్నాత్‌వై ప్రజాయంతే = అన్నము మూలముననే జనించు చున్నవి సర్వమున కన్నమే మూలాధారమని దీని భావము.—

మంత్రము: "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే అన్నేన జాతాని జీవన్తి అన్నం ప్రయంత్యభి సంవిశన్తి"—

[తైత్తిరీయము - భృగువల్లి - 2]

టీక: అన్నం = ఆహారము, బ్రహ్మేతి = పరబ్రహ్మ స్వరూపమని, వ్యజానాత్ = గుర్తింపుము. అన్నాత్ + హి + ఏవ + ఖలు = నిశ్చయముగా అన్నము నుండియే కదా!, ఇమానిభూతాని = ఈ సమస్త ప్రాణులు, జాయంతే = పుట్టుచున్నవి. జాతాని = పుట్టిన జీవులు, అన్నేన = అన్నముతో, జీవంతి = బ్రతుకుచున్నవి. మఱియు -

అన్నం ప్రయంతి = అన్నమును గూర్చియే, అభిసంవిశంతి = ప్రవేశించుచున్నవి. అనఁగా లయమగుచున్నవని భావము—

[తైత్తిరీయోపనిషత్, ఆనందవల్లి - ద్వితీయానువాకము ]

తినఁబడునదియు, తినునదియు కావున అన్న మనఁబడును.

మంత్రము: అన్నం ననింద్యాత్ తత్ వ్రతం -

[తైత్తిరీయము - భృగువల్లి - 7 - అనువాకము]

భాష్యము: అన్నమును నిందింపరాదు - అన్నము నెన్నఁడు - దూషింపనను వ్రతము మానవున కుచితము-అన్నద్వేషియైనవాఁడు పరబ్రహ్మద్వేషియై నరకమునఁ గూలును. అని వేదశిఖలు ఘోషించుచుండ కులమతాంతర శాఖలు కల్పించి ఒక కులమువారి, ఒక మతమువారి యన్నమును తద్భిన్నులగువారు తినరాదని వాదులాడుట మహాశ్చర్యము.

ఈ ఘట్టమునే కాక ద్విర్బద్ధం సుబద్ధమని భావించి తైత్తిరీయాష్టమానువాకమున "అన్నం నపరిచక్షీత తద్వ్రతమ్" అన్నమును పరిహరింపకుండుటయే మానవుని వ్రతమని చెప్పఁబడెను. ఈ మంత్ర వ్యాఖ్యానమున శంకరభగవత్పాదులు "అన్నం న పరిహరేత్ పాత్రస్థమన్నం న నిరాకుర్యాత్" అని భాష్యము వ్రాసిరి. మఱియు తైత్తిరీయ వ్యాఖ్యానకర్తయగు రంగరామానుజముని "స్వగృహే రాత్ర్యాదౌ భోజనార్థ మాగతం కమపినరం న నిరాకుర్యాత్" రాత్రి మొదలగు భోజనావసర సమయముల ఆహారమునకై యే జాతివాఁడరుదెంచినను అతని ఆదరించి అతిథిగా స్వీకరించి తృప్తి పఱుపుము. ఏ పరిస్థితులలోనైన నిరాకరింపకుమని నుడివిరి. ఇట్లు అద్వైత విశిష్టాద్వైత మతకర్తలు మాటిమాటికి బోధించినను మానవజాతికి మత్సరము తొలఁగుట లేదు. సకలోపనిషత్తులలో అన్న ప్రాశస్త్య మెంతయో గలదు

శంకరభగవత్పాదులకు జ్ఞానోపదేశము గావించిన మాలఁడు సైతము "అన్న మయాదన్నమయమ్" సకల శరీరము లన్నమయములని యుద్ఘోషించెను. "అన్నమే అన్నమని ఛాందోగ్యము [5-2-1] [6-6-2] లలోఁ గలదు. ప్రాదియై "అన" శబ్దము ప్రాణమగుట ఉభయయతియని అనంతుఁడు అన శబ్దమునే గ్రహించెను. "అన్నా ద్భవంతి భూతాని" [భగవద్గీత - కర్మయోగము - 14. శ్లో.] అన్నము వలన సకల భూతములు పుట్టుచున్నవని కలదు.

మంత్రము: "అన్న మశితం త్రేధా విధీయతే తస్యయః స్థవిష్ఠో ధాతు స్తత్ పురీషం భవతి యో మధ్యమ స్తన్మాంసం యోఽణిష్ఠ స్తన్ మనః" [ఛాందోగ్యము - 6-5-1]

తా॥ తిన్నమీఁదట అన్నము మూఁడు రీతులుగా మాఱును. అందులోని స్థూల తత్వము మలమగును. మధ్యమతత్వము మాంసమగును. సూక్ష్మతత్వము మనస్సగును. ఇట్లే అన్నము సూక్ష్మాంశమే మనస్సని విశదీకరింపఁబడినది.

మంత్రము. "అన్నం వై ప్రజాపతి స్తతోహవై తద్రేత స్తస్మాదిమాః ప్రజాః ప్రజాయంత ఇతి - [ప్రశ్నోపనిషత్తు 1-ప్రశ్నము. 14-మంత్రము]

తా॥ అన్నము కూడ ప్రజాపరిపాలన రూపమే. ఆహారము వలన రేతస్సేర్పడును. అదియే సంతాన హేతువు. "అన్నాద్రేతః రేతసః పురుషః" అన్నము వలన రేతస్సు, రేతస్సు వలన పురుషుఁడు కలుగునని తైత్తిరీయము నందును గలదు.

## 2. శుక్ల శోణితములు

పురుషుల రక్తాది దేహాంశముల సారము, ప్రత్యవయవ తేజమే శుక్లము - శోణితము, జీవసృష్టికివి కారణములు -

శ్లో॥ యథాపయసి సర్పిస్తు గుడశ్చేక్షౌ రసోయథా
శరీరేషు తథాశుక్రం నృణాం విద్యాత్ భిషగ్వరః॥ [సుశ్రుతము]

తా॥ పాలలో నేయి చెఱకు రసములో బెల్లమువలె మనుష్యుల దేహమున వీర్యము సారముగా నుండును.

# 1. ఆకాశము

శ్లో॥ అథాఽకాశస్య భూతస్య సార్థం జ్ఞాతేతి కథ్యతే
శేషార్థంచ చతుర్భాగాన్ కృత్వా సమ్మిశ్ర మాచరేత్
పవనే మిళితాకాశం భాగం మానస ముచ్యతే
అనలే మిళితాకాశం బుద్ధి రిత్యభిధీయతే
జలేన మిళితాకాశం చిత్త మిత్య భిధీయతే
పృథివ్యాం మిళితాకాశం అహంకార మితీరితమ్.

[విష్ణుయామిళమ్]

భాష్యము: ఆకాశార్థభాగము జ్ఞాతయాయెను. మిగతాసగభాగము నాలుగుభాగములై అందొకటి వాయువుతోఁగూడి మనస్సాయెను. మఱియొకభాగము అగ్నితోఁగూడి బుద్ధియాయెను. మఱొకటి జలముతోఁగూడి చిత్తమాయెను. ఇంకొకటి భూమితోఁగూడి అహంకారమాయెను.

1. జ్ఞాత 2. మనస్సు 3. బుద్ధి 4. చిత్తము 5. అహంకారము - వీనినే ఆకాశపంచకమందురు. జ్ఞాతతక్క తక్కిన మనోబుద్ధిచిత్తాహంకారముల నాల్గింటిని అంతఃకరణచతుష్టయ మందురు. ఇవి కర్మ, జ్ఞానేంద్రియదశకమువలె స్పష్టీకృతము గాక లోపలియింద్రియములై యున్నందున వీనికి అంతఃకరణమని పేరుగలిగెను. ఈనాలుగు హృదయపురిలోనుండును.

1. జ్ఞానము 2. జ్ఞేయము 3. జ్ఞాత - వీనిని త్రివిధకర్మములందురు

శ్లో॥ జ్ఞానం, జ్ఞేయం, పరిజ్ఞాతా॥ త్రివిధా కర్మచోదనా
కరణం, కర్మ, కర్తేతి॥ త్రివిధః కర్మసంగ్రహః॥

1. శబ్ద స్పర్శాది తత్తద్వస్తు త్వావచ్ఛిన్న విషయకం జ్ఞానమ్.

తా॥ శబ్దాదులగు తన్మాత్రలు మొదలగు ఆ యా వస్తుభావములయందు ఎడతెఱపి లేక ప్రవర్తమాన మగు తెలివి జ్ఞానము. అనఁగా కర్మస్వరూపమును దెలిసికొనుట జ్ఞానము.

శ్లో॥ జ్ఞానం ద్వివిధ మాఖ్యాతం॥ శాస్త్రీయం చార్థబోధజం
బోధా న్నిర్దహతేక్షిప్ర మశేషం పాపపంజరమ్॥

ప్రవృత్తిజ్ఞాన మనియు, నివృత్తిజ్ఞాన మనియు జ్ఞానము రెండు విధములు. అందు ప్రవృత్తిజ్ఞానము విషయజ్ఞాన మనియు, శాస్త్రజ్ఞాన మనియు చెప్పఁబడును. నివృత్తిజ్ఞానమనఁగా అనుభవజ్ఞానమని, నిర్విషయజ్ఞానమని, స్వప్రకాశజ్ఞానమని చెప్పఁబడును.

జ్ఞానము స్వానుభవమైనయెడల నివృత్తిజ్ఞానమనఁదగును. ఆ జ్ఞానమే వాచాజ్ఞానమైనయెడల ప్రవృత్తిజ్ఞాన మనఁదగును. ప్రవృత్తిజ్ఞానమువలన సభారంజనమే ప్రయోజనము. అనుభవమైన నివృత్తిజ్ఞానము మోక్షప్రదము.

2. జ్ఞేయము॰ తత్తద్వస్తుత్వావచ్ఛిన్నం చ జ్ఞేయమ్

తా॥ ఆయావస్తుసంచయమును గుర్తించి చేయుపని జ్ఞేయము. అనఁగా ఎఱిఁగి చేయఁదగిన కర్మ జ్ఞేయము.

3. జ్ఞాత. తాదృశజ్ఞానాధికరణం చాఽహ మిత్యభిమానవాన్ పరిజ్ఞాతేతి త్రివిధా కర్మా-

జ్ఞానజ్ఞేయములు చేయుట కధికారిని నే ననుకొని తలఁచువాఁడు పరిజ్ఞాత - లేదా జ్ఞాత యనిపిలువఁబడును. అనఁగా కిరణము (పనిముట్టు) జ్ఞానము, కర్మ (చేయఁదగిన పని) జ్ఞేయము, కర్త (చేయువాఁడు) జ్ఞాతఅనియు పరిజ్ఞాతఅనియు పిలువఁబడును.

జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతలను త్రిపుటియందురు.

## ఆకాశవాయుసంభవమైన మనస్సు

శ్లో॥ 1. ఇహైవాధోముఖం నాళదండే పద్మం వ్యవస్థితం
కదళీపుష్ప సంకాశ మత్యతిష్ఠ ద్దశాంగుళం

2. తత్పద్మే కర్ణికామధ్యే॥ యదా విశ్రామ్యతే మనః
తదా సర్వగుణజ్ఞానే॥ చైతన్యేపి మతి ర్భవేత్

3. పూర్వేశానే కృపాజ్ఞానే॥ ఉత్తరే భోగవర్ధినీ
నైరుత్యేతు దశేమోహో॥ దక్షిణే క్రోధమత్సరా
నిద్రాలస్యే తదాచాగ్నౌ॥ సంధౌ జాడ్యం త్రిదోషదమ్.

తా॥ 1. ఈశరీరమందే దండాకృతియైన నాళము గలిగి అరఁటిపూవువలె అధోముఖమైన పద్మము పదియంగుళములకు మించియుండెను.

2. ఆపద్మముయొక్క కర్ణికయందు మనస్సెప్పుడు విశ్రాంతిచెందునో అపుడు సర్వజ్ఞత్వముగలిగి చైతన్యమే నేనను బుద్ధి గలిగియుండును.

3. మనస్సు తూర్పుదళమందున్నపుడు భూతదయ గలిగియుండును. ఈశాన్య దళమందున్నపుడు బ్రహ్మజ్ఞానముతో నుండును - ఉత్తరదళమందున్నపుడు భోగవృద్ధి గలిగి యుండును. నైరృతిదళమందున్నపుడు మోహమునందును. దక్షిణదళమందున్న పుడు క్రోధము, మాత్సర్యముగలుగును. ఆగ్నేయదళమందున్నపుడు అలసట, నిద్ర గలుగును. దళసంధులయందున్నపుడు జడత్వము త్రిదోషములు గలుగును. త్రిదోషము లనఁగా వాత, పిత్త, శ్లేష్మజములగు మూఁడుదోషములు ఆదోషమువలనఁగలుగు రోగవిశేషములని భావము.

శ్రుతి: కామ. స్సంకల్పో, విచికిత్సా, శ్రద్ధా, అశ్రద్ధా, ధృతి, రధృతిః, హ్రీః, ధీః, భీ రిత్యేత త్సర్వం మనఏవ —

తా॥ కామము, సంకల్పము, సంశయము, కర్మలయందాసక్తి, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, ప్రజ్ఞ, భయము మొదలగునవి యన్నియు మనస్సే —

శ్రుతి మనోహి ద్వివిధం ప్రోక్తం॥ శుద్ధం చాశుద్ధ మేవచ
అశుద్ధం కామసంకల్పం॥ శుద్ధం కామవివర్జితమ్.

తా॥ కామ, సంకల్పాదులతో ఒప్పుచున్న మనస్సు అపరిశుద్ధమనస్సనియు, కామసంకల్పాది రహితమైన మనస్సు శుద్ధమనస్సనియు చెప్పఁబడును.

భాష్యము "మనుతే జానాతి ఇతి మనః"

జీవుని తెలిసికొనునది కావునమనస్సు - ఈ మనస్సునకు జననీజనకులు ఆకాశమువాయువులగుటచే సర్వవ్యాపకత్వము, సర్వసత్తామాత్రమని గ్రహింపవలెను.

శ్లో॥ మనో దశేంద్రియాధ్యక్షం॥ హృత్పద్మే గోళకస్థితమ్
తచ్చాంతఃకరణం బాహ్యే॥ ష్వస్వాతంత్ర్యా ద్వినేంద్రియైః -
[పంచదశి]

తా॥ జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల పదింటికి మనస్సు అధిపతి. ఆ మనస్సు హృదయకమలమందున్నది. ఇంద్రియములతోనే సంబంధముకలది మనస్సు. దీనికి

స్వతంత్రగమనము లేదు. కాఁబట్టి మనస్సు - అంతరింద్రియము - లేక - అంతఃకరణ మని చెప్పఁబడును.

శ్లో॥ బంధాయ విషయాసక్తం ముక్త్యై ర్నిర్విషయం మనః —

భాష్యము: మనస్సు విషయవాసనలయం దాసక్తి గలిగియుండుట బంధముకొఱకు - విషయవాసనలను పరిత్యజించుట మోక్షముకొఱకు అని తెలియునది. కనుక సవిష యము, నిర్విషయము అని మనస్సు రెండు విధములు. రాగాదులున్నపుడు సవిషయము రాగాదులు లేక వివేకాదులున్నపుడు నిర్విషయము. రాగాదులతోఁ గూడిన మనస్సు ఆత్మనుఖండించి ముక్కలు ముక్కలు చేయును.

శ్లో॥ మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః

భాష్యము: మనుష్యులకు మనస్సే బంధ, మోక్షములకుఁ గారణము.

మనస్సు తలంచినయెడల బుద్ధి నిశ్చయించును. చిత్తము విచారించును. అహంకార మభిమానించును. బుద్ధి, చిత్తము, అహంకారములు ఈ మూఁడును మనో వృత్తులేయని కొందఱందురు

శ్లో॥ చంద్రమా మనసోజాతః॥ చక్షో స్సూర్యో అజాయత॥
శ్రోత్రాత్ వాయుశ్చ ప్రాణశ్చ॥ ముఖా దగ్ని రజాయత.

[యజుర్వేద పురుషసూక్తము]

తా॥ మనసునుండి చంద్రుఁడు, కంటినుండి సూర్యుఁడు, చెవినుండి వాయువు ప్రాణములను - ముఖమునుండి అగ్నియు పుట్టెను.

శ్రీకృష్ణయజుర్వేదమందలి ఆరణ్యకభాగములోని "కశ్యపః పశ్యకోభవతి." [1-8] కశ్యపశబ్దమును త్రిప్పిచదివినచో "పశ్యకః" అగును. ఈ దృష్టికి ద్రష్ట అను నర్థమువచ్చును. అట్లే మనః శబ్దమును త్రిప్పిచూచిన నమః అగును - కనుక శక్తి మంతమైన మనస్సునకు నమస్సులు అని పెద్దలందురు.

## బుద్ధి:

బుద్ధికి జననీజనకులు ఆకాశము అగ్నియగుటచే సర్వవ్యాపకత్వము, స్వరూప సందర్శనము దీనియందలిగుణములు. పరిపరివిధములు పరుగెత్తు మనస్సునకు నిశ్చయ జ్ఞానము నిచ్చును.

ఏకాగ్రమైన మనస్సు బుద్ధియనఁబడును. "బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్" అతీంద్రియమైనదియు బుద్ధికి గ్రాహ్యమగునని భావము. "మనసశ్చ పరాబుద్ధిః" [కఠోపనిషత్] మనసుకంటె బుద్ధి సూక్ష్మము.

ఈబుద్ధి సప్తవిధములు 1. పండ 2. మేధ 3. చార్వి 4. చత్వ 5. గృహీత 6. శ్రౌతి 7. ప్రతిభ.

1. పండ = తత్త్వము తెలిసికొనఁదగిన బుద్ధి.

2. మేధ = విన్నదానిని మఱవకుండు బుద్ధి.

3. చార్వి = ఊహాపోహలందు నేర్పుగల బుద్ధి.

4. చత్వ = విషయములను చక్కఁగానడిగి విసుగులేక వినుటయందు నేర్పు గల బుద్ధి.

5 గృహీత = చెప్పినవానిని తప్పక గ్రహించుటయందు శక్తిగల బుద్ధి.

6. శ్రౌతి = గురుశుశ్రూషా సహనముగల బుద్ధి.

7. ప్రతిభ = ఏదోనొకవిషయమును పలుకవలసివచ్చినపుడు వాగ్ధోరణిగలిగి సమయోచితముగ శ్రుతిస్మృతీతిహాసానుభవములు పెక్కులుచూపి విషయముఁదెలుపుట యందు శక్తి గల బుద్ధి.

## చిత్తము:

చిత్తమునకు జననీజనకులు ఆకాశము జలముగనుక వ్యాపకత్వము ప్రతిబింబ భావరూపమైన చలన మిందలి గుణములు.

శ్లో॥ ఘోరం జాగ్రన్మయం చిత్తం మూఢం స్వప్నే వ్యవస్థితమ్
శాంతం సుషుప్తి మాసన్నం త్రిభిర్హీనం మృతం భవేత్.

తా॥ చిత్తమునకు ఘోరవృత్తి, మూఢవృత్తి, శాంతవృత్తి, మృతవృత్తి అని నాల్గువృత్తులు గలవు.

1. ఘోరవృత్తి = జాగ్రదవస్థ.

2. మూఢవృత్తి = స్వప్నావస్థ.

3. శాంతవృత్తి = సుషుప్త్యవస్థ.

4. మృతవృత్తి = తుర్యావస్థ. ఈ తురీయావస్థను జ్ఞాననేత్రముతోనే తిలకింప సాధ్యమగును. సుఖవంతులయెడ మైత్రియు, దుఃఖవంతుల యెడ కరుణయు, పుణ్యాత్ములయెడ సంతోషమును, పాపాత్ములయెడ ఉపేక్షయును భావించువారలకు చిత్తము ప్రసన్నతనొందును. దీనినే చిత్తప్రసాదన మందురు.

## అహంకారము:

అహంకారమునకు జననీజనకులు ఆకాశము, భూమి గనుక వ్యాపకత్వము, కాఠిన్యముతోఁగూడిన గర్వము ఇందలిగుణములు.

### మనోబుద్ధి చిత్తాహంకారములస్థితి

శ్రుతిః బుధ్యాబుధ్యతి నిశ్చినోతి, మనసా సంకల్పతే వికల్పతేచ చిత్తేన సంజానాతి అహంకారేణ చాహంకరోతి - తాని తాని తత్తద్విషయేషు వర్తంతే

[యాజుషీయ గర్భోపనిషత్]

తా॥ బుద్ధిచేతగ్రహించి నిశ్చయించుకున్నాఁడు. మనస్సుచేత సంకల్పవికల్పములు చేయుచున్నాఁడు. చిత్తముచేత పదార్థమును బాగుగా గుర్తించుచున్నాఁడు. అహంకారముచేత గర్వించుచున్నాఁడు. ఇట్లివి తమ తమ విషయములందున్నవి.

శ్రుతి: మనోబుద్ధి రహంకార శ్చిత్త మిత్యంతఃకరణ చతుష్టయమ్ - తేషాం క్రమేణ సంకల్పవికల్పాధ్యవసాయాభిమానావధారణా స్వరూపాశ్చైతే విషయాః —

1. మనస్థానం గళాన్తం 2. బుద్ధేర్వదనం 3. అహంకారస్యహృదయం 4. చిత్తస్యనాభిరితి -

[యజుర్వేదీయశారీరకోపనిషత్]

శ్లో॥ సంఘాత మహ మాధత్తే॥ బుద్ధి స్థైర్యం వ్రజత్యతః

మన శ్చాంచల్య వృత్తి స్స్యా॥ చ్చిత్తం స్వానుభవాత్మకమ్.

తా॥ దేహేంద్రియాదులను అహంకార మభిమానించును. బుద్ధిస్థిరతను గూర్చును - మనస్సు చంచలవృత్తిగలది - చిత్తము స్వానుభవరూపమైనది. ఈ చిత్తము స్థిరమైన విశేషరూపముతోఁ గూడిన బుద్ధికి వృత్తి విశేషమని గ్రహించునది.

అంతఃకరణచతుష్టయత్రిపుటి

| అధ్యాత్మికము | అధిదైవము | అధిభౌతికము |
|---|---|---|
| మనస్సు | చంద్రుఁడు | సంకల్పవికల్పములు |
| బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| చిత్తము | క్షేత్రజ్ఞుఁడు | యోచన |
| అహంకారము | రుద్రుఁడు | నేననెడి అభిమానము |

# 2. వాయువు

శ్లో॥ యథాచ వాయు రర్థంచ వ్యాన మిత్యభికీర్తితమ్
శేషార్థే త్వేకభాగంచ సమానం వ్యోమ మిశ్రితమ్
అగ్న్యా సమ్మిశ్రితం భాగం ఉదాన మభిధీయతే
జలేషు మిశ్రితం భాగం తత్ప్రాణ మితి కథ్యతే
పృథివ్యాం మిశ్రితం భాగం అపాన మితి కీర్తితమ్.

[విష్ణుయామిళం]

వివరణము. వాయువులోని అర్థభాగము వ్యానమాయెను. తక్కిన అర్థము నాలుగు భాగములు చేసి అందొకదానిని ఆకాశముతోఁ గలిసి సమాన వాయు వాయెను. మఱొకదానిని అగ్నితోఁ గలిసి ఉదానవాయు వాయెను. ఇంకొకదానిని జలములోఁ గలిసి ప్రాణవాయు వాయెను మఱొక్కదానిని భూమితోఁగలిసి అపానవాయు వాయెను. వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపానవాయువులను వాయుపంచకమని - ప్రాణపంచకమని యందురు.

## 1. వ్యానము :

ఇది వాయువులో సగ భాగ మగుటచే సర్వశక్తి సంపన్నమై సర్వాంగముల వ్యాపించి దేహమును, ఇంద్రియములను త్రిప్పును.

మంత్రము: హృది హ్యేష ఆత్మా అత్రైతద్ ఏకశతం నాడీనాం తాసాం శతంశ మేకైకస్యాం ద్వాసప్తతిర్ ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీ సహస్రాణి భవంత్యాసు వ్యాశ్చరతి. [ప్రశ్నోపనిషత్ 3-6

టీక. ఏషహిఆత్మా=ఈజీవాత్మ, హృది=హృదయమునసుండును, అత్ర=అచట ఈ హృదయమున, నాడీనాంఏతత్ఏకశతం=నూటొక్కనాడులుండును. తాసాం=ఆనాడులలో ప్రతిదానికి, శతంశతం=నూరునూరు ఉపనాడులున్నవి, ఏకైకస్యాం=ఆశాఖనాడులలో ఒక్కొక్కదానియందు, ద్వాసప్తతిః ద్వాసప్తతిః = డెబ్బదిరెండు డెబ్బదిరెండు, ప్రతిశాఖానాడీసహస్రాణి = వేలకొలంది చిన్న చిన్న నాడులున్నవి, అసు = ఈనాడులన్నింటిలో, వ్యానఃచరతి = వ్యాననామముగలవాయువు తిరుగుచున్నది. ఇది సర్వవ్యాపక మని పిండితార్థము

భాష్యము: ఈ దేహమున కధినేతయగు జీవాత్మ హృదయమను మాంసపిండమందుండును. దీనికి నూటొక్కనాడులు మూలనాడు లుండును ఈనూటొక్కనాడులలో ప్రతినాడినుండి నూరునూరు ఉపనాడులు బయలుదేరును ఈయుపనాడులలో ప్రతిదానికి డెబ్బదిరెండువేలచొప్పున సూక్ష్మనాడు లేర్పడి శరీరమంతటను వ్యాపించును.

ఈనాడు లన్నింటిలో నుండు ప్రాణమునకు వ్యానమని పేరు. ఈ వ్యానము సమస్త శరీరమునకు పోషకరసమును చేకూర్చును

## 2. సమానవాయువు :

దీని జననీజనకులు వాయువు, ఆకాశములు. ఇది నాభియందుండి ప్రాణి భుజించు ఆహారమును డెబ్బదిరెండువేల నాడులకు నొసంగి పుష్టిని కలుగఁజేయును.

## 3. ఉదానవాయువు :

దీని జననీజనకులు వాయువు, అగ్ని. ఇది కంఠమందు నిలిచి పలు తెఱఁగులగు మాటలఁ బలికించును.

వివరణ : ఇది కంఠస్థానమున నుండునది. దీనినే కంఠగతప్రాణ మందురు.

మంత్రము : అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యలోకం నయతి, పాపేన పాప, ముభాభ్యా మేవ మనుష్యలోకమ్ - [ప్రశ్నోపనిషత్-3-7]

భాష్యము : కంఠము నుండి వెడలు ఉదానవాయువు హృదయము నుండి వెడలు నూటొక్క నాడులలో నొకటి యగు సుషుమ్నానాడీ ద్వారమున నాభికి పైభాగము నుండి కంఠము వఱకు సంచరించును. జీవుఁ డీ శరీరమందుండి పుణ్య కార్యములు గావించిన పుణ్యలోకములకు, పాపకార్యములు గావించిన పాపలోకములకు, శుభా శుభ కర్మలు రెండును సమానముగాఁ జేసిన మనుష్యలోకమునకుఁ జేర్చును.

ఈ విషయమే కఠవల్లియం దిట్లు వివరింపఁబడినది.

శతంచైకా చ హృదయస్య నాడ్యః, తాసాం మూర్ధాన మభినిస్సృతైకా - ఏతస్యామేవ సుషుమ్నానాడ్యా ముదానో విచరతి. ఇయం నాడీ మూర్ధాన మారభ్యా పాదతల మస్మిన్ శరీర ఆయతా - అస్యామేవ హృదిస్థాయాం జీవాత్మా తిష్ఠతి. అన యైవ మనోయుంజానాః సమాహితా యోగిన ఆత్మజ్ఞానం లభంతే. ఉదాననామా ప్రాణ ఏవ లింగశరీరేణ సార్థం జీవాత్మానం శరీరా న్నిస్సారయతి. కర్మానుకూలో యోని భోగౌచ ప్రాపయతి.

తా॥ హృదయమునకున్న నూటొక్క నాడులలో నొకటి శిరస్సు నందలి బ్రహ్మరంధ్రము దిశకు వెడలియున్నది. ఇదే సుషుమ్న - దీనియందే ఉదానవాయువు సంచరించును. ఈ నాడి నఖశిఖ పర్యంతము విస్తరించి యున్నది. ఈ నాడి యందే జీవాత్మ యుండును. ఈ నాడీ ద్వారమున యోగ మభ్యసించువారు సమాహితు లగుదురు. ఆత్మజ్ఞానము నందుదురు. లింగశరీరముతో పాటు జీవుని శరీరము నుండి బయటకు నడుపునది ఉదానవాయువే. ఆ యా జీవు లాచరించు శుభా శుభ కర్మల కనుకూలములైన శరీరములఁ జేర్చి సుఖ దుఃఖముల నొందించు చుండును.

## 4. ప్రాణవాయువు :

దీని జననీజనకులు వాయువు జలములు. ఇది హృదయ మందు నిలిచి నాసికా ద్వారములతో ఉచ్ఛ్వాస నిశ్వాసములు గావించుచుండును.

## 5. అపానవాయువు :

దీని జననీజనకులు వాయువు భూమి - ఇది గుదమందు నిలిచి మలమూత్రముల విసర్జించుచుండును.

భాష్యము : హృదయమున కయిదు ద్వారము లుండును. తూర్పు ద్వారమున ప్రాణ వాయువు, దక్షిణ ద్వారమున వ్యానవాయువు, పశ్చిమమున అపానవాయువు, ఉత్తర మున సమాన వాయువు, ఊర్ధ్వమున ఉదానవాయువు లుండును. వీనినే దేవసుషు లందురు సుషి యనఁగా రంధ్రము దేవసుషు లనఁగా దేవరంధ్రము లని భావము. ఈ విషయము ఛాందోగ్య మందలి త్రయోదశ ఖండములో 1-208-4-5 మంత్రముల యందు వివరింపఁబడియున్నది.

## వాయుస్థానములు :

శ్లో॥ హృది ప్రాణ, గుదేఽపాన, సమానో నాభిసంస్థితః
ఉదానః కంఠదేశస్థః, వ్యాన స్సర్వ శరీరగః - [అమరకోశము]

ఉపవాయువులు

1. నాగ, 2. కూర్మ, 3. కృకర, 4. దేవదత్త, 5. ధనంజయ వాయువులు.

1. నాగవాయువు : ఇది ఉద్గారప్రవర్తమానవాయువు. వమనము చేయించును.

2. కూర్మవాయువు : దర్శనప్రవర్తమానవాయువు - కనురెప్పల మూయునట్లు, తెఱచునట్లు చేయించును.

3. కృకరవాయువు : క్షుతప్రవర్తమానవాయువు - తుమ్మించును.

4. దేవదత్తవాయువు : జృంభప్రవర్తమానవాయువు - శరీరమును నీల్గునట్లు చేసి ఆవులింతల గలిగించును.

5. ధనంజయవాయువు : శవ శరీరప్రవర్తమానవాయువు. మరణదేహమును వీడునట్లు చేయును.

# 3. అగ్ని

శ్లో॥ అగ్ని మధ్యేర్థ భాగంతు చక్షురి త్యభిధీయతే
తథా వ్యోమగతం భాగం శ్రోత్ర మిత్యభిధీయతే
వాయునా మిశ్రితం భాగం త్వగింద్రియ మితీరితమ్
జలేషు మిశ్రితం భాగం జిహ్వా ఇత్యభిధీయితే
పృథివ్యాం మిశ్రితం భాగం ఘ్రాణేంద్రియ మితిస్మృతమ్.

[విష్ణుయామిళం]

భాష్యము : అగ్నియొక్క అర్థభాగము చక్షువాయెను. తక్కిన సగభాగమును నాల్గు భాగములు చేసి అందొక భాగము ఆకాశముతోఁ గలిప శ్రోత్రము - అనఁగా చెవి యాయెను. మఱొకభాగము వాయువుతోఁ గలిప చర్మ మాయెను. ఇంకొక భాగము జలముతోఁ గలిప నాలుకయాయెను. మఱొక్క భాగము భూమితోఁ గలిప ఘ్రాణ మాయెను. అనఁగా ముక్కు అయెను. ఈ శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణము లను అగ్నిపంచకమని, జ్ఞానేంద్రియ పంచకమని యందురు.

చక్షువు :

ఇది అగ్ని అర్థభాగ మగుటచే బలవత్తరమైన శక్తి కల దాయెను. సర్వేంద్రియ ములలో నయనము ప్రధాన మందురు. "యథాచక్షుషాపశ్యతి తథా మనసా విజానాతి" అని వాత్స్యాయన మహర్షి వాకొనెను. కంటితో నెట్లు చూచునో? అట్లే మనస్సుతో విశేషముగా నెఱుఁగును.

శ్లో॥ నేత్రే జాగరితం విద్యాత్ కంఠే స్వప్నం సమావిశేత్
సుషుప్తం హృదయస్థం తం తురీయం తద్విలక్షణమ్.

[బ్రహ్మోపనిషత్]

భాష్యము . నేత్రములు, కంఠము, హృదయము అను ఈ మూఁడును జీవునకు విశేష నివాసస్థానము లందురు. జీవుఁడు జాగ్రదవస్థలో నేత్రము లందును, స్వప్నా వస్థలో కంఠము నందును, సుషుప్త్యవస్థలో హృదయమునందు నుండును.

# 4. జలము

శ్లో॥ జలేష్వర్థం రసం జ్ఞేయం శబ్దం వ్యోమే చ మిశ్రితమ్
వాయునా మిశ్రితం భాగం స్పర్శం చ భవ నిశ్చయమ్
అగ్నౌ సమ్మిశ్రితం భాగం రూప మిత్యభిధీయతే
పృథివ్యాం మిళితం భాగం గంధ మిత్యభిధీయతే.

[విష్ణుయామిళం]

వివరణ. జలము యొక్క అర్థ భాగము రసంబాయెను. తక్కిన అర్థ భాగము నాలుగు భాగములు చేసి అందొక భాగమును ఆకాశముతోఁ గలుప శబ్దం బాయెను. మఱొక భాగమును వాయువుతోఁ గలుప స్పర్శం బాయెను. మఱొక్క భాగమును అగ్నితోఁ గలుప రూపం బాయెను. ఇంకొక భాగమును భూమితోఁ గలుప గంధం బాయెను. ఈ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను జలపంచక మనియు, తన్మాత్ర లనియు నందురు.

# 5. భూమి

శ్లో॥ పృథివ్యా మర్థభాగం చ పాయు రింద్రియ ముచ్యతే
వ్యోమేచ మిళితం పృథ్వీ భాగం వా గింద్రియం మతమ్
వాయునా మిశ్రితం పృథ్వీ భాగం పాణీంద్రియం తథా
అగ్నినా మిళితం భాగం పాదేంద్రియ మితి స్మృతమ్
జలేషు మిళితం భాగం ఉపస్థమితి కథ్యతే

[విష్ణుయామిళం]

భూమియొక్క సగ భాగము పాయు వాయెను. తక్కిన సగ భాగమును నాల్గు భాగములు చేసి అందొక దానిని ఆకాశముతోఁ గలుప వాక్కు ఆయెను. మఱొక భాగమును అగ్నితోఁ గలుప పాద మాయెను. ఇంకొక భాగమును జలముతోఁ గలుప ఉపస్థ యాయెను. ఈ వా, క్పాణి, పా, దోపస్థ, పాయువులను భూ పంచక మని, కర్మేంద్రియ పంచకమని యందురు. పాయు వనగా మలద్వార మగు ముడ్డి.

భాష్యము: వాక్కు : వాక్కునకు ఎనిమిది స్థానములు గలవు. 1. జిహ్వామూలము, 2. హృదయము, 3. కంఠము, 4. మూర్ధము, 5. దంతములు, 6. నాసిక, 7. ఓష్ఠములు 8. తాలువులు.

జిహ్వామూలము మొదలగు స్థానముల సంబంధముచే వివిధ రూపముల నొందుచు బహిర్గతమైన స్వరము హృదయగతభావమును దెలుపునవు దది వాక్కు అనఁబడును.

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| ఆకాశ పంచకము | జ్ఞాత | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| వాయు పంచకము | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| అగ్ని పంచకము | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| జల పంచకము | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| భూ పంచకము | వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | వాయువు |
| | ఆకాశాంశాలు | వాయ్వంశములు | అగ్ని అంశములు | జల అంశములు | భూమి అంశములు |

1. పృథివి : అస్థి, నాడీ, రోమ, మాంసాశ్చేతి పృథివ్యంశాః -
[శారీరకోపనిషత్]

ఎముకలు, నరములు, రోమములు, మాంసము, చర్మము - ఈ యయిదు పృథివి యంశములు.

2. జలము : మూత్ర, శ్లేష్మ, రక్త, శుక్ల, స్వేదా అబంశాః -
[శారీరకోపనిషత్]

మూత్రము, శ్లేష్మము, రక్తము, శుక్లము, చెమట-ఈ యైదు జలాంశములు.

3. అగ్ని. క్షు, తృష్ణా, లస్య, మోహ, మైథునా న్యగ్నేః - [శారీరకోపనిషత్]

ఆఁకలి, దప్పిక, ఆలస్యము, మోహము, రతి-ఈ యైదు అగ్ని యంశములు.

4. వాయువు : ప్రచారణ, విలేఖన, స్థూలా, క్ష్యన్మేష, నిమేషాది వాయోః -
[శారీరకోపనిషత్]

పరుగులిడుట, నీల్గుట, వణఁకుట, కంప మొందుట, దృష్టించి చూచుట ఈ యైదు వాయువు అంశములు.

5. ఆకాశము. కామ, క్రోధ, లోభ, మోహ, భయాన్యాకాశస్య -

[శారీరకోపనిషత్]

కామము, క్రోధము, లోభము, మోహము, భయము-ఈ యైదు ఆకాశాంశములు.

| | | | | వివరణః |
|---|---|---|---|---|
| భూమి | అర్ధ భాగము | ఎముకలు | భూమి - | తన వలనఁ |
| భూమి | జలములోఁ గలిపి | మాంసము | తత్త్వము | దెలియఁబడిన ఈ |
| భూమి | అగ్నిలోఁ గలిసి | చర్మము | | తత్త్వము తన్ను |
| భూమి | వాయువులోఁ గలిసి | నరములు | | తెలియనేరదు గాన |
| భూమి | ఆకాశములోఁ గలిసి | రోమములు | | |
| | | | | |
| జలము | అర్ధ భాగము | మూత్రము | జల - | ఇది జడము. వీని |
| జలము | పృధివిలోఁ గలిపి | మజ్జ | తత్త్వము | నెఱిఁగిన |
| జలము | అగ్నిలోఁ గలిపి | చెమట | | యెరుకయే |
| జలము | వాయువులోఁ గలిసి | రక్తము | | తాను. |
| జలము | ఆకాశములోఁ గలిసి | శుక్లము | | |
| | | | | |
| అగ్ని | అర్ధ భాగము | నిద్ర | అగ్ని - | |
| అగ్ని | పృధివిలోఁ గలిసి | ఆఁకలి | తత్త్వము | |
| అగ్ని | జలములోఁ గలిపి | దప్పిక | | |
| అగ్ని | వాయువులోఁ గలిసి | మైధునము | | |
| అగ్ని | ఆకాశములోఁ గలిపి | ఆలస్యము | | |
| | | | | |
| వాయువు | అర్ధ భాగము | నడచుట | వాయు - | |
| వాయువు | పృథివిలోఁ గలిసి | పరుగిడుట | తత్త్వము | |
| వాయువు | జలములోఁ గలిపి | ఉండుట | | |
| వాయువు | అగ్నిలోఁ గలిపి | ముడుచుట | | |
| వాయువు | ఆకాశములోఁ గలిసి | నిలుచుట | | |
| | | | | |
| ఆకాశము | అర్ధ భాగము | మోహము | ఆకాశ - | |
| అకాశము | పృథివిలోఁ గలిసి | కామము | తత్త్వము | |
| ఆకాశము | జలములోఁ గలిసి | లోభము | | |
| ఆకాశము | అగ్నిలోఁ గలిపి | భయము | | |
| ఆకాశము | వాయువులోఁ గలిసి | క్రోధము | | |

## జ్ఞానేంద్రియములు

శ్లో॥ సత్వాంశైః పంచభి స్తేషాం క్రమా దింద్రియపంచకమ్
శ్రోత్ర త్వ గక్షి రసన ఘ్రాణాఖ్య ముపజాయతే॥

తా. ఆకాశాదిసూక్ష్మభూతములయొక్క సత్వగుణభాగములచేత చెవులు, చర్మము, కనులు, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియ పంచకము కలిగెను.

వివరణ: 1. చెవి.- ఆకాశసత్వగుణభాగము - శబ్దమును గ్రహించును.
2. చర్మము.- వాయుసత్వగుణభాగము - స్పర్శమును గ్రహించును.
3. చక్షువు - అగ్నిసత్వగుణభాగము - రూపమును గ్రహించును.
4. జిహ్వ'- జలసత్వగుణభాగము - రసమును గ్రహించును
5. ఘ్రాణము'- భూసత్వగుణభాగము - గంధమును గ్రహించును.

## కర్మేంద్రియములు

శ్లో॥ రజోంశైః పంచభి స్తేషాం క్రమా త్కర్మేంద్రియాణితు
వాక్పాణి పాద పా యూప స్థాభిధానాభిజజ్ఞిరే.

వివరణ. 1. వాక్కు - ఆకాశరజోగుణభాగము - వచించుకర్మనాచరించును.
2. పాణి:- వాయురజోగుణభాగము - ఇచ్చిపుచ్చుకొనుకర్మనాచరించును.
3. పాదము - అగ్నిరజోగుణభాగము - గమనకర్మము నాచరించును.
4. పాయువు - భూ రజోగుణభాగము - మలవిసర్జనకర్మనాచరించును.
5. ఉపస్థ'- జలరజోగుణభాగము - శుక్లశోణితాది రసవిసర్జనకర్మ నాచరించును.

### జ్ఞానేంద్రియత్రిపుటి

| అధ్యాత్మికము | అధిదైవము | అధిభూతము |
|---|---|---|
| శ్రోత్రము | దిక్కు | శబ్దము |
| త్వక్కు | వాయువు | స్పర్శము |
| చక్షుస్సు | సూర్యుఁడు, చంద్రుఁడు | రూపము |
| జిహ్వ | వరుణుఁడు | రసము |
| ఘ్రాణము | అశ్వినీకుమారుఁడు | గంధము |

## కర్మేంద్రియత్రిపుటి

| అధ్యాత్మము | అధిదైవము | అధిభూతము |
|---|---|---|
| వాక్కు | అగ్ని | పచనము |
| పాణి | ఇంద్రుఁడు | ఇచ్చిపుచ్చుకొనుట |
| పాదము | విష్ణువు | గమనము |
| పాయువు | యముఁడు | మలవిసర్జనము |
| ఉపస్థ | ప్రజాపతి | రతిభోగము |

## ప్రాణపంచకము

| వాయువు | స్థానము | అధిదైవతము |
|---|---|---|
| ప్రాణము | హృదయము | చక్షువు, ఆదిత్యుఁడు, అక్షరము |
| అపానము | పాయువు | పృథ్వి, అగ్ని, అక్షరము |
| వ్యానము | సర్వశరీరము | మనసు, చంద్రుఁడు, అక్షరము |
| ఉదానము | కంఠము | శ్రోత్రము, దిక్కులు, అక్షరము |
| సమానము | నాభి | ఆకాశము |

[ఛాందోగ్యము ననుసరించి]

శ్లో॥ ఆకాశాదిగతాః పంచ సాత్త్వికాంశాః పరస్పరమ్
మనోబుద్ధి రహంకారః చిత్తంచేతి తదుచ్యతే.

తా. ఆకాశాదిభూతములయొక్క సత్త్వాంశమువలన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము - అను అంతఃకరణచతుష్టయము కలిగెను.

శ్లో॥ సమస్తేభ్యో రజోంశేభ్యో వ్యోమాదీనాం క్రియాత్మికా
ప్రాణాదయ స్సముత్పన్నాః పంచా ప్యంతరవాయవః.

తా. ఆకాశాదుల రజోంశమువలన ప్రాణము, అపానము, వ్యానము, సమానము - అను పంచప్రాణవాయువులు పుట్టెను.

శ్లో॥ శబ్దస్పర్శౌ రూపరసౌ గంధోభూత గుణాఇమే
ఏక, ద్వి, త్రి, చతుః పంచ గుణా వ్యోమాదిషు క్రమాత్.

తా. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములనునవి ఆకాశాది పంచభూతముల గుణములు.

| పంచభూతములు | గుణములు | సంఖ్య |
|---|---|---|
| 1. ఆకాశము | శబ్దము | ఒకటి |
| 2. వాయువు | శబ్దము, స్పర్శము | రెండు |
| 3 అగ్ని | శబ్దము, స్పర్శము, రూపము | మూఁడు |
| 4. జలము | శబ్ద, స్పర్శ, రూప, రసములు | నాలుగు |
| 5. పృథివి | శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు | అయిదు |

శ్లో॥ బుద్ధిః కర్మేంద్రియ ప్రాణ పంచకర్మ నసాధియా
శరీరం స ప్తదశభి స్సూక్ష్మం తల్లింగ ముచ్యతే.

తా. జ్ఞాన, కర్మేంద్రియములు, పంచవాయువులు, బుద్ధి, మనస్సు - ఈ పదు నేడుచేరి సూక్ష్మశరీరమనియు, లింగశరీరమనియు, కారణశరీరమనియు చెప్పఁబడును.

## తత్వములు

శ్రుతి: చతుర్వింశతి తత్వాని కేచి దిచ్ఛంతి. వాదినః కేచిత్ ష ట్త్రింశ త్తత్వాని కేచిత్ షణ్ణవతీని చ.

తా. కొంద ఱిరువది నాల్గని, ఇంకకొందఱు ముప్పదియాఱని, మఱికొందఱు తొంబదియాఱని తత్వముల విభజించియున్నారు వరాహోపనిష త్తులో ఈ వివరణము గలదు.

### 24 - తత్వములవారి విభాగము

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు పది. వాయుపంచకము, తన్మాత్రపంచకము, అంతఃకరణచతుష్టయముతో నిరువదినాల్గు.

### 36 - తత్వములవారి విభాగము

పై ఇరువది నాలుగుతోపాటు పంచభూతములు, స్థూల, సూక్ష్మకారణ శరీర త్రయము, జాగ్ర, త్స్వప్న, సుషు ప్త్యవస్థాత్రయము జీవుని కలుపుకొని ముప్పది యాఱగును.

### 96 - తత్వములవారి విభాగము

పై ముప్పదియాఱు తత్వములతోపాటు - ఉండుట, పుట్టుట, పెరుగుట, పరిణ మించుట, క్షీణించుట, నశించుట - అనుషడ్వికారములును - ఆఁకలి, దప్పిక, శోకము ,

మోహము, ముదిమి, మరణము - అను షడూర్మలును - చర్మము, రక్తము, మాంసము, క్రొవ్వు, మజ్జ, అస్థి - అను షట్కోశములును - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను అరిషడ్వర్గమును - విశ్వ, తైజస, ప్రాజ్ఞులను జీవ త్రయమును - సత్వరజస్తమస్సులను గుణత్రయమును - ప్రారబ్ధము, ఆగామి, సంచితములను కర్మత్రయమును - మాటాడుట, ఎత్తుట, నడచుట, మలమూత్రవిసర్జనము, విషయానందము - అను కర్మేంద్రియవ్యాపారములును, సంకల్ప, ప్రయత్న, అభిమాన, నిశ్చయములను అంతకరణ చతుష్టయమును - సంతోషము, దయ, మైత్రి, ఉపేక్ష - అను గుణవిశేషములును - దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, మృత్యువు, చంద్రుడు, చతుర్ముఖబ్రహ్మ విష్ణువు, రుద్రుడు, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు - అను ఈ వన్నియుచేరి తొంబది యాఱగును

## శరీరోత్పత్తి విధానము - యాజుషీయ గర్భోపనిషత్

శ్రుతి శుక్లశోణితసంయోగాత్ ఆవర్తతే గర్భో హృది వ్యవస్థాం నయతి.

తా॥ స్త్రీ పురుషుల శుక్లశోణితసంయోగమువలన గర్భమేర్పడి హృదయస్థానము నొందియుండును.

శ్రుతి: ప్రాజాపత్యర్తుకాలే ప్రసంయోగత ఏకరాత్రోషితం కలలం భవతి.

తా॥ ప్రాజాపత్యక్రమముగా ఋతుకాలిక సంయోగానంతర మొకరాత్రి తరువాత మీఁగడవంటి ముద్ద యగును.

శ్రుతి: సప్తరాత్రోషితం బుద్బుదం భవతి - అర్ధమాసాభ్యంతరేణ పిండో భవతి - మాసాభ్యంతరేణ కఠినోభవతి - మాసద్వయేన శిరః కురుతే - మాసత్రయేణ పాదప్రదేశో భవతి - అథ చతుర్థేమాసే జఠరకటిప్రదేశో భవతి - పంచమేమాసే పృష్ఠవంశో భవతి - షష్ఠేమాసి నాసాక్షిశ్రోత్రాణి భవంతి - సప్తమేమాసే జీవసంయుక్తో భవతి - అష్టమేమాసే సర్వసంపూర్ణో భవతి - నవమే పీవతే.

తా॥ ఏడుదినములకు నీటిబుడగవలె, పక్షములోపల పిండము, ఒక నెలకు గట్టిపడుట, రెండునెలలకు శిరస్సు, మూడునెలలకు పాదములు, నాల్గవనెల నడుము - కడుపు, అయిదవమాసమున వెన్నెముక, ఆఱవమాసమున ముక్కు, కండ్లు, చెవులు. ఏడవనెల ప్రాణము, ఎనిమిదవనెల శరీరావయవములన్నియు పూర్తిగా నేర్పడును. తొమ్మిదవనెలలో గర్భమందు శిశువు తిరుగుచుండును.

శ్రుతి: శుక్లం పుంభాగః - శోణితం స్త్రీభాగః - ఉభయం క్లీబమ్.

తా॥ వీర్యము పురుషభాగము - శోణితము స్త్రీభాగము - ఈ రెండును కలియక విడిగానుండునెడల నపుంసకము.

శ్రుతి. పితృరేతోతిరేకా త్పురుషోభవతి - మాతృరేతోతిరేకాత్ స్త్రియోభవంతి- స్త్రియోహి కామిన్యః, ఆసాం సుఖాధిక్యా త్తాఏవ బహుళా జాయంతే - ఉభయో ర్బీజ తౌల్యే నపుంసకో భవతి.

తా॥ తండ్రివీర్యమధికమగుచో మగపిల్లవాఁడు, తల్లిశోణిత మధికమగుచో ఆఁడుపిల్ల - సామాన్యముగా స్త్రీలు కామాధిక్యముగలవారుగాన స్త్రీలే మిక్కుటముగాఁ గలుగుచుందురు. అయితే తలిదండ్రులయొక్క శుక్లశోణితములు సమానమయ్యేనేని ఆ శిశువు నపుంసకుఁడగును.

శ్రుతి: తస్యైతచ్ఛరీరస్య షోడశద్వయ దంతపటలాని - దశపంచ సంధయః- షణ్ణవత్యంగుళోన్మానం - చతుర్దశనాడీస్థానాని - అష్టోత్తరశతం మర్మాణి - తత్ర ద్విసప్తతి ధమన్యః - తాసాంమధ్యే ద్విసప్తతిస్థానం - ముఖ్యా స్త్రిసః - ఇడా - పింగళా - సుషుమ్నా చేతితురీయా పురీతతిః - పంచమీ జీవితం - జీవితా దధిపిత్తం- పిత్తా దర్వీ క్పురీతతిః - నాభే రూర్ధ్వం ద్వ్యంగుళే వామభాగే పిత్తమూలం ప్రతిష్ఠితమ్

తా॥ ఈ దేహమందు ముప్పదిరెండుదంతములును, పదునైదు సంధులును, పదునాల్గునాడీస్థానములును, నూటయెనిమిది మర్మములును, డెబ్బది ధమనులును గలవు. ఎవరి అడ్డవేళ్ళతో వారు తొంబదియాఱు అడ్డవేళ్ళ పొడవు గల్గియుందురు. అనఁగా ఇరువది నాలుగు బెత్తలు పొడవుగల్గియుందురని భావము - ఈ డెబ్బదిరెండు ధమనుల మధ్యను డెబ్బదిరెండుస్థానము లున్నవి వీనిలో - 1. ఇడా - 2. పింగళా - 3. సుషుమ్నలను మూఁడును ప్రధానములు. నాల్గవది పురీతతి యనునది. అయిదవది జీవితమనునది ఈ జీవితనాడి కవతల పిత్తనాడి యుండును. నాభికి ఊర్ధ్వమున రెండంగుళముల ఎడమప్రక్క పిత్తనాడియొక్క మూలముండును.

శ్రుతి. అన్న మశితం త్రేధా విధీయతే. మూత్రం, పురీషం, సార ఇతి - మూత్రం ద్విధాభూత్వా నాభేరధో వామే ప్రస్రవతి - పురీషం స ప్తధా - తత్ర దక్షిణే వర్తతే - సారః పంచవిధః - శరీరం వ్యాప్నోతి - తేనవై రేత శ్శోణితం చాన్నపానాభ్యామ్.

తా॥ తినిన ఆహారము - 1. మూత్రము - 2 పురీషము - 3. సారము - అని ముప్విధములుగా మాఱును. అందుమూత్రము రెండు రీతులై నాభికి క్రిందుగా ఎడమ భాగమునకు స్రవించును. పురీషము ఏడువిధములై ఎడమభాగముగుండ వెడలిపోవును. సారము అయిదువిధములుగా మాఱి నాభికి కుడిప్రైపున నుండి శరీరావయవముల కన్నిటికి వ్యాపించును. అట్టి అన్నపానములలోని సారములో ప్రధానభాగమువలన పురుషులకు రేతస్సును, స్త్రీలకు శోణితమును ఏర్పడును.

శ్రుతి. రసః పక్వ స్సవిత్రీ కుక్షౌ - స్రంసిన్యా జరాయుం గత్వా శిశుశిరః కపాలం ప్రవిశ్య సుషుమ్నాద్వారా - గర్భశాబక ప్రాణం తర్పయతి.

తా॥ తల్లి గర్భమందలి ఆహారములోనుండి పక్వమైనరసము "స్రంసినీ" యను నాడీమూలమున గర్భమందలి మావిని పొంది గర్భస్థశిశువుయొక్క శిరస్సు మధ్యభాగమందుండు సుషుమ్నానాడినుండి ప్రసరించి ఆ శిశువునకు ప్రాణతృప్తిని గలిగించుచున్నది.

శ్రుతి తస్మి న్లోమ్నా మష్టౌకోటయః అశీతి స్సంధిశతం నవస్నాయు శతాని హృదయం పలాన్యష్టౌ ద్వాదశపలా జిహ్వా పిత్తం ప్రస్థం కఫశ్చాఢకం శుక్లం కుడవం మేదః ప్రస్థౌ ద్వౌ సర్వం నశ్వరం విజ్ఞాయ యథాగర్భగ స్సుషుమ్నా ప్రతిష్ఠితో భూయాజ్జంతు ర్వివేక్యుచ్యతే న పునశ్శరీరం ప్రాప్నోతి.

తా॥ అట్టి శరీరము ఎనిమిదికోట్ల రోమములును, ఎనిమిదివేల సంధులును, తొమ్మిదివందల స్నాయువులును, ఎనిమిది పలముల హృదయమును, పంన్రెండు పలముల నాలుకయు, ఒక కుంచము పిత్తమును, ఒకతూము కఫమును, శుక్లధాతువొక*కుడవమును, మేదస్సు రెండుకుంచములును గలదియై నశించుస్వభావము గలిగినది. దీనితత్వమెఱింగినవాఁడు తాను తల్లిగర్భమందుండు కాలములోవలె బ్రహ్మరంధ్రగతుఁడగుటకుఁ బ్రయత్నించుచో వాఁడు వివేకి యనఁబడును. అట్టివాఁడే శరీరము ను తిరిగి పొందఁడు. జననమరణదుఃఖ ప్రవాహ విముక్తుఁడగును.

## ఆసనములు:

శ్లో॥ సిద్ధాంబుజం స్వస్తిక ముక్త పీర
భద్రాఽహిభుక్ సింహ గవాముఖాని

* కుడవము - సం.అ.పుం. ధాన్యమాన విశేషము. ఇది ప్రస్థములో నాల్గవవంతు కుడవము రూపాంతరము కుడపము -

సుఖాసనశ్చైవ సమంచితాని
తతో దశైతాని వరాసనాని.

తా॥ సిద్ధము, పద్మము, స్వస్తికము, ముక్తము, వీరము, భద్రము, మయూరము, సింహము, గోముఖము, సుఖాసనము అను నీ పదియాసనములు మిక్కిలి శ్రేష్ఠములైనవి.

శ్లో॥ గృహిణా మంబుజం, సిద్ధం గృహస్థాత్మకవర్త్మనాం
సుఖాసనంచ సర్వేషా మిత్యేతా త్రివిధం వరమ్.

తా॥ గృహస్థులకు పద్మాసనము, సన్యాసులకు సిద్ధాసనము, సర్వులకు సుఖాసనము - అను నీ మూఁడాసనములు మేలైనవి.

శ్లో॥ పాషాణే మృత్యు మాప్నోతి కాష్ఠే నానావిధాన్ గదాన్
కృష్ణాజినే జ్ఞానసిద్ధిః మోక్షశ్రీ ర్వ్యాఘ్రచర్మణి
వంశాసనేతు దారిద్ర్యం ధరణ్యాం దుఃఖసంభవః
తృణాసనే యశోహానిః పల్లవే చిత్తవిభ్రమః
శ్వేతవస్త్రే యశోవృద్ధిః సర్వార్ధీ చిత్రకంబళే.

తా॥ రాతియందు మరణము, కొయ్యపీఁటయందు రోగము, నల్లజింకచర్మమందు జ్ఞానసిద్ధి, పులితోలునందు మోక్షము, వెదురుచాపయందు దారిద్ర్యము, భూమియందు దుఃఖము, తృణాసనమందు యశోహాని, చిగురుటాకులయందు చిత్తభ్రాంతి, తెల్లని వస్త్రమందు కీర్తి, చిత్రాసనమందు సర్వకామ్యములు సిద్ధించును - ఆసనశుద్ధి కలిగిన ఆశయసిద్ధి కలుగును

# సమాధి

శ్లో॥ ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాత్ ధ్యేయైకగోచరమ్
నివాతదీపవ చ్చిత్తం సమాధి రభిధీయతే॥

తా॥ చిత్తము ధ్యాతను, ధ్యానక్రియను క్రమముగా విడిచి ధ్యేయమొక్కటియే విషయముగాఁగలదగుచు గాలిలేనిచోటనున్న దీపమువలె నిశ్చలముగా నెపుడుండునో అపుడు సమాధియని చెప్పఁబడును.

శ్లో॥ యదా సంక్షీయతే ప్రాణో మానసంచ ప్రలీయతే
తదా సమరసత్వంచ సమాధి రభిధీయతే.

తా॥ సమాధియనఁగా ప్రాణము లీనమైనపుడు మనసును లీనమగును. అపుడు సమరసభావము కలుగును. దీనినే సమాధి యందురు.

భాష్యము. ఈ సమాధి నిష్ఠాగరిష్ఠులకు 1. అవిద్య 2 అస్మితము 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశము అనునట్టి పంచక్లేశములు లేవు.

ఈసమాధి సవికల్ప, నిర్వికల్పములని రెండు విధములు

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వివిధా భవేత్
దృశ్యశబ్దాను విద్ధోఽయం సవికల్పః పున ర్ద్విధా॥

తా॥ సమాధి సవికల్పకమనియు, నిర్వికల్పకమనియు రెండు రీతులు. అందు సవికల్పకము దృశ్యానువిద్ధసవికల్పకమని, శబ్దానువిద్ధసవికల్పకమని రెండు విధములు. ఈ మూఁడును బాహ్యాభ్యంతర భేదముల వలన ఆఱు విధము లగును.

1. బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి.
2. ఆంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధి.
3. బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి.
4. ఆంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి.
5 బాహ్యనిర్వికల్పసమాధి.
6. ఆంతరనిర్వికల్పసమాధి.

## 1. బాహ్యదృశ్యానువిద్ధసవికల్ప సమాధి :

బ్రహ్మాదిసకలదేవతలును, సకలచేతనాచేతనములును, బాహ్యదృశ్యములును సమస్తమును తనతెలివియందే పుట్టిగిట్టు ననియును, సమస్తదృశ్యములకును తాను విలక్షణుఁడైన పరమాత్మ స్వరూపుఁడననియు భావించుట.

## 2. ఆంతరదృశ్యానువిద్ధసవికల్ప సమాధి :

తనయందు సహజముగా సంభవించు అంతరదృశ్యములనఁబడు వృత్తులకు తాను విలక్షణుఁడైన పరమాత్మస్వరూపుఁడనని తలఁచుట.

## 3. బాహ్యశబ్దానువిద్ధసవికల్ప సమాధి :

బాహ్యశబ్దములగు సకలనామములకును తాను విలక్షణుఁడననియు, నామరూప క్రియారహితుఁడగు పరమాత్మయే తాననియు తలఁచుట

## 4. అంతరశబ్దానువిద్ధసవికల్ప సమాధి :

అంతరశబ్దము లనెడి - కామాది షడ్వర్గములకును, మఱియు ప్రణవనాద మందలి 1. చిణీనాదము 3 చిణిచిణీనాదము 3. ఘంటానాదము 4. శంఖనాదము 5. వీణానాదము 6. తాళనాదము 7. వేణునాదము 8. భేరీనాదము 9 మృదంగ నాదము 10. మేఘనాదము - అను దశవిధ నాదములకు తాను విలక్షణుఁడ నని తలఁచుట.

## 5. బాహ్యనిర్వికల్ప సమాధి :

పైఁజెప్పిన నాలుగుసమాధులయందును తనకంటె భిన్నమైనదేదియు కనుపింపక పరమాత్మస్వరూపమును నేనేయని తలఁచియుండుట.

## 6. అంతరనిర్వికల్ప సమాధి :

పై నుదహరించినవానికంటె విలక్షణుఁడననెడి వృత్తిలేక కేవలము పరమాత్మ స్వరూపమును నేనేయని తలఁచియుండుట.

ఈ సమాధులందు సర్వసమతాభావము సంభవించును. ఏవిధమగు భేదభావము కనుపించదు. మనస్సు సంపూర్ణముగా సమైక్యముగా నుండునది సంప్రజ్ఞాతసమాధి యనియు, మనస్సు ఏకమై పరమాత్మయందే ఐక్యమైయుండునది అసంప్రజ్ఞాత సమాధియనియు నందురు ఈ యసంప్రజ్ఞాతసమాధినే అంతరనిర్వికల్పసమాధియని కొంద ఱందురు

శ్లో॥ యదాభవతి చైకత్వం జీవాత్మ పరమాత్మనోః
తదా సమాధ్యవస్థాయాం గమిష్యంతి యమీశ్వరాః.

[శివయోగప్రదీపిక]

తా॥ ఎప్పుడు జీవాత్మపరమాత్మలకు సమైక్యము కలుగుచున్నదో అపుడు యోగీశ్వరులు సమాధిస్థితి నందెదరు.

శ్లో॥ ప్రజ్ఞాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం తథైవచ
అత ద్వావృత్తిరూపోఽయం సమాధి ర్యోగినాం ప్రియః.

తా॥ ప్రజ్ఞ, మనస్సు, బుద్ధి శూన్యమై ఈరీతిగానే ప్రవృత్తి నివృత్తిరహితమైన స్థితిగల సమాధి యోగులకు చాల ప్రియము - ఇది అష్టాంగయోగములలో చిట్టచివరిది.

శ్లో॥ సమాధి నిర్ధూతమలస్య చేతసో
నివేశితస్యాత్మని య త్సుఖం భవేత్
న శక్యతే వర్ణయితుం గిరా తదా
యదేత దంతః కరణేన గృహ్యతే.

తా॥ సమాధియందు చిత్తము విక్షేపరహితమై ఆత్మయందు ప్రవేశించును, అప్పుడుగలిగిన సుఖ మింతింతయని వర్ణించుటకు శక్యము గాదు. దీనికే స్పర్శయోగ మని పేరు. ఇది యోగులకును దుర్లభము. మనసు ఆత్మలోఁగలియుటయే సమాధిగాన అదియే బ్రహ్మసంస్పర్శము.

శ్లో॥ యోగీ సమాధికాలేతు నశృణోతి నపశ్యతి
నజిఘ్రతి నజానాతి తత్పదం కిం విభావయేత్.

తా॥ సమాధికాలమందు యోగీశ్వరుఁడు వినఁడు, చూడఁడు, రుచిచూడఁడు, గుర్తింపఁడు ఈస్థానము నెట్లు భావింపవచ్చును. అది పరమసుఖదము, అది అనిర్వచనీయము.

## బ్రహ్మజ్ఞాని

శ్లో॥ ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దుష్కృతమ్
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మేత్యేతి సనాతనమ్.

తా॥ బ్రహ్మజ్ఞాని తన పుణ్యమును మిత్రులకడను, తన పాపమును శత్రువుల కడ నుంచి ధ్యానయోగముచే శాశ్వత బ్రహ్మానంద మందుచున్నాఁడు.

శ్రుతి. తస్యపుత్రాదాయ ముపయంతి, సుహృదః సాధుకృత్యం ద్విషంతః పాపకృత్యమ్.

తా॥ జ్ఞానియొక్క ధనాదికముల పుత్రులును, పుణ్యకర్మముల స్నేహితులును, పాపకర్మముల ద్వేషించు నిందకపురుషులును గ్రహింతురు.

శ్రుతి. అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి.

12-మంత్రము - ప్రథమాధ్యాయము - ద్వితీయవల్లి [కఠోపనిషత్తు]

తా॥ సాధనసంపత్తిగల సాధకుఁడు పరమాత్మ నెఱింగినవాఁడై యీ జన్మ మందే లాభాలాభ నిమిత్తక మగు సుఖదుఃఖములను విడుచుచున్నాఁడు.

శ్రుతి నయనం కృతాకృతే తపత ఇతి - [యాజ్ఞవల్క్య బ్రాహ్మణము]

తా॥ చేయఁబడినవి, చేయఁబడనివి యగు పాపపుణ్యములు జ్ఞానిని తపింపఁ జేయవు.

శ్రుతి సగుణబ్రహ్మోపాసకో గుణవాన్ భవతి. నిర్గుణ బ్రహ్మోపాసకస్తు బ్రహ్మైవ భవతి. [కేనోపనిషత్తు]

తా॥ సగుణ బ్రహ్మోపాసకుఁడు గుణశాలిమాత్ర మగును. నిర్గుణ బ్రహ్మోపాసకుఁడు కేవల పరబ్రహ్మస్వరూపుఁ డగును.

శ్లో॥ నిర్వ్యాజ, స్స్వీయధర్మజ్ఞో, వేదజ్ఞ, స్తత్వపారగః,
విరక్తో, వేషనిర్ముక్తో షడ్భి ర్యోగీ ముని ర్భవేత్.

తా॥ మిషలేనివాఁడును, స్వధర్మజ్ఞుఁడును, వేదజ్ఞుఁడును, తత్వవేదియు, విరక్తుఁడును, వేషముపై ఆసక్తి లేనివాఁడును - ఈ యాఱింటిచేఁ గూడినవాఁడు ముని యనఁబడును.

# యోగలక్షణము

## పతంజలియోగసూత్రములు

సూ॥ యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రా వివేకఖ్యాతేః -

తా॥ యోగాంగముల చక్కఁగా ననుష్ఠించుటచే పాపక్షయముకాఁగా వివేకము పుష్కలముగాఁ గలుగు వఱకును జ్ఞాన ముద్దీపించును.

సూ॥ యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధయోఽష్టా వంగాని -

తా॥ 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధారణ, 7. ధ్యానము, 8. సమాధి - ఇవి యెనిమిది యోగాంగములు.

## 1. యమము :

సూ॥ అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహా - యమాః -

భాష్యము : 1 పరుల హింసింపకుండుట, 2. నిజము పలుకుట, 3. దొంగిలించ కుండుట, 4. పరస్త్రీలను దలఁపక స్వభార్యతో ఋతుకాలమందు సుఖమనుభవించుట, 5. ఎట్టి స్థితిలోనైనను పరులకడ చేచాఁపి గ్రహింపకుండుట - ఈ యైదును యమము లనఁబడును.

## 2. నియమము :

సూ॥ శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానాని నియమాః -

భాష్యము . 1. మృజ్జలాదులతో బాహ్యశౌచమును, సర్వభూత ప్రీతితో మైత్రితో అంతశ్శౌచమును గలిగి యుండుట, 2. నిత్య సంతృప్తియై సంతోషి యగుట, ఇంద్రియముల స్వేచ్ఛగా సంచరింపనీక తనవశమందుంచుకొనుట. 4. జ్ఞానదాయకము లగు వేద, వేదాంతముల నిరతము చదువుట, 5. ఈశ్వర ధ్యానములను ఈ యైదును నియమము లనఁబడును.

## 3. ఆసనము:

సూ॥ స్థిర సుఖ మాసనమ్ -

తా॥ దేహమున కెట్టి కదలిక, ఉద్వేగము లేకుండునట్లు కూర్చుండుట ఆసన మనఁబడును.

## 4. ప్రాణాయామము:

సూ॥ తస్మి న్సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః -

తా॥ లోపలి నుండి వెలుపలికి వచ్చు గాలి యగు శ్వాసను - వెలుపలి నుండి లోపలికి పీల్చు గాలి యగు ప్రశ్వాసను పోనీయకుండ నిరోధించుటయే ప్రాణాయామ మనఁబడును.

వెలుపలికి వచ్చు గాలి యగు శ్వాసగతినిరోధమే రేచకము, వెలుపలి నుండి లోనికి పీల్చు గాలి యగు ప్రశ్వాస గతినిరోధమే పూరకము - లోపల నీ రెంటిని స్తంభింపఁజేయుటయే కుంభకము.

## 5. ప్రత్యాహారము:

సూ॥ స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః -

భాష్యము : ప్రాణాయామానంతరము చక్షురాదీంద్రియముల రూపాదివిషయ బాహ్య విషయములతోఁగాని - స్మృతిరూప అంతర విషయములతోఁగాని కలుపక ఆ ఇంద్రియములను అంతఃకరణమందే లీనమగునట్లొనర్చుట ప్రత్యాహార మనఁబడును.

సర్వేంద్రియములు తమ తమ వృత్తుల నుండి మరలింపఁబడి అంతఃకరణమందే లీనమొనర్చుటచే ప్రత్యాహార మను సార్థకసంజ్ఞ దీనికిఁ గలిగినది.

## 6. ధారణ:

సూ॥ దేశబంధ శ్చిత్తస్య ధారణా -

భాష్యము : నాభిచక్ర - నాసాగ్రాది ప్రదేశ విశేషమందు చిత్తమును బంధించి ఏ సంకల్పములను చిత్తములోనికి రానీకుండ స్థిరీకరించుట ధారణ యనఁబడును.

## 7. ధ్యానము

సూ॥ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ -

భాష్యము . ధారణయం దేది ఆలంబనముగా నొనర్పఁబడెనో దానినే ఊఁతగాఁగొని నిరంతరముగా నుండుట ధ్యాన మనఁబడును.

## 8. సమాధి:

సూ॥ తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః -

భాష్యము . ధ్యానమందు ధ్యాతయగు తాను, ధ్యేయుఁడగు ఈశ్వరుఁడు, ధ్యానరూప క్రియలను మూఁడు వస్తువుల యొక్క భాస ముండును. ఈ మూఁటిలో రెండు నశించి సర్వము ధ్యేయమాత్రమే యైనపుడు సమాధి యనఁబడును.

# సాధనచతుష్టయము

1. నిత్యా ఽ నిత్యవస్తు వివేకము, 2. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, 3. శమాది షట్కసంపత్తి, 4. ముముక్షు - వీనిని సాధన చతుష్టయ మందురు.

## 1. నిత్యాఽనిత్యవస్తువివేకము :

సూ॥ నిత్యాఽనిత్యవస్తు నిర్ధారణాకారేణ వివేకేన విశిష్టత్వం నిత్యాఽనిత్యవస్తు వివేకః -

తా॥ ఏది నిత్యమగు వస్తువో, ఏది అనిత్యమగు వస్తువో నిర్ధరించుకొను జ్ఞానముతోఁ గూడినదే నిత్యాఽనిత్యవస్తు వివేకము.

## 2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము :

సూ॥ ఐహికాముష్మిక సకలభోగపరాఙ్ముఖత్వరూపేణ వైరాగ్యేణ యుక్తత్వం ఇహాముత్రార్థ ఫలభోగ విరాగః -

తా॥ ఈ లోకమందలి, పరలోకమందలి సమస్తమైన భోగములకు వైముఖ్య రూపమైన వైరాగ్యముతోఁ గూడియుండుటే ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము.

## 3. శమాదిషట్కసంపత్తి :

1. శమము, 2. దమము, 3. ఉపరతి, 4. తితిక్ష, 5. శ్రద్ధ, 6. సమాధానము - ఈ యాఱింటిని శమాదిషట్క మందురు.

### 1. శమము :

సూ॥ అంతరాంతరాణాం రాగద్వేషాదీనాం అనావిర్భూతి శ్శమః - యద్వా - శమోనామ మనసో నిగ్రహః -

తా॥ రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, ఈర్ష్య, అసూయ, దంభ, దర్ప, అహంకారములు పుట్టకుండుట శమము లేదా మనో నిగ్రహము.

2. దమము :

సూ॥ సర్వేషా మింద్రియాణాం అవిహితవ్యాపారేభ్యో నివర్తనం దమః - యద్వా - దమోనామ బాహ్యేంద్రియ నిగ్రహః -

తా॥ సమస్తేంద్రియముల - అనఁగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములను అయుక్త వ్యాపారముల నుండి తొలఁగించుట దమము - లేదా - బాహ్యేంద్రియ నిగ్రహము.

3. ఉపరతి :

సూ: ఉపరతిర్నామ సర్వకర్మణాం త్యాగః - స ఏవ న్యాస ఇతి కథ్యతే -

తా॥ తమతమ వర్ణాశ్రమోచిత సకల కర్మలను వదలుటయే ఉపరతి - దీనినే న్యాస మందురు - లేదా -

సూ॥ నిషిద్ధకామ్యకర్మ వ్యాపారోపరమ ఉపరతిః - యద్వా - ఉపరతిస్తు విషయేభ్య స్స్వయమేవ నివృత్తిః -

తా॥ నిషేధింపఁబడిన కామ్య కర్మముల వదలుట ఉపరతి - లేదా - విషయముల నుండి తనంతతాను మరలుట.

4. తితిక్ష :

సూ॥ ద్వంద్వసహిష్ణుత్వం తితిక్షా - యద్వా - తితిక్షానామ సుఖ దుఃఖాది సహిష్ణుతా -

తా॥ సుఖదుఃఖములు మొదలగు సమస్త ద్వంద్వముల సహించుకొనుట తితిక్ష.

5. శ్రద్ధ :

సూ॥ అపురుషార్థ సకలేతర శాస్త్రపరాఙ్ముఖీ - పరవిద్యామయ పరమాత్మ తంత్రోపనిషద్గోష్ఠీ సముత్కంఠరూపా సత్వకలా శ్రద్ధా - యద్వా - శ్రద్ధానామ గురు, వేదవాక్యేషు విశ్వాసః -

తా. పురుషార్థములుగాని సమస్తములైన యితర శాస్త్రముల యందు విముఖత - పరవిద్యా స్వరూపములును, పరమాత్మ ప్రబోధకములగు వేద, వేదాంతముల

యందలి గోష్ఠిపై అత్యాసక్తిరూపమైన సత్వకల శ్రద్ధ - లేదా - గురువాక్య, వేద వాక్యములందు విశ్వాసము శ్రద్ధ.

6. సమాధానము :

సూ॥ సమధ్యానగుణేన చేతసః స్థైర్యం సమాధానం - యద్వా - చిత్తస్య పరతత్వాభిముఖ్యం సమాధానమ్ - యద్వా - వినిష్ఠతంత్రాది విక్షేపస్య చిత్తస్య పరతత్వాభిముఖ్యం సమాధానమ్ -

తా॥ ఆలస్యాది విక్షేపములు లేని చిత్తమును పరతత్వమున కభిముఖముగాఁ జేసికొనుట సమాధానము. [ఇది శమాదిషట్క సంపత్తి]

## 4. ముముక్షు :

సూ॥ పరమానందావేశమయ మహామోక్ష లక్ష్మీదర్శనత్వరా ముముక్షా -

తా॥ బ్రహ్మానంద స్వరూప మగు సచ్చిదానంద స్వరూపమును సందర్శించుట యందలి సత్వరమే ముముక్ష. [ఇది సాధనచతుష్టయము]

# పంచకోశములు

శ్లో॥ అన్నం, ప్రాణో, మనో, బుద్ధి, రానందం, కోశపంచకమ్॥

1. అన్నమయకోశము 2. ప్రాణమయకోశము 3. మనోమయకోశము 4. బుద్ధిమయకోశము 5. ఆనందమయకోశము అని కోశములైదు.

## 1. అన్నమయకోశము :

శ్రుతి: అన్నకార్యాణాం సమూహోఽన్నమయః కోశః

తా॥ ఆహారపరిణామరూపమగు ఈ స్థూల దేహమంతయు అన్నమయకోశ మనఁబడును.

శ్లో॥ వ్యష్టి రేషాస్య విశ్వస్య భవతి స్థూలవిగ్రహః
ఉచ్యతేఽన్నవికారత్వాత్ కోశోఽన్నమయ ఇత్యయమ్.

తా॥ విశ్వుని స్థూలశరీరమగు ఈదేహము అన్నవికారమైనది గావున అన్నమయకోశమని చెప్పఁబడును.

శ్లో॥ దేహోఽయం పితృభుక్తాన్న వికారా చ్ఛుక్లశోణితాత్
జాతః ప్రవర్ధతేఽన్నేన తదభావే వినశ్యతి.

తా॥ ఈ శరీరము తలిదండ్రులు భుజించిన అన్నవికారమైన శుక్లశోణితముల వలన కలిగినది. అన్నముచేత అభివృద్ధి నందుచున్నది. అన్నము లేకున్న నశించును; కనుక అన్నమయకోశమని చెప్పఁబడును.

ఈ కోశమం దాత్మయున్నపుడు భ్రమగల్గి నేను మనుష్యుఁడను, స్థూలశరీరిని, ప్రభువును, అని ప్రతీతియగుచుండును.

శ్లో॥ ఆచ్ఛాదకత్వా దేతస్యాఽప్యసేః కోశవదాత్మనః.

తా॥ ఇది కత్తికి ఒరవలె ఆత్మకు కోశముగా నుండుటచే కోశ మనఁబడుచున్నది.

## 2. ప్రాణమయకోశము :

శ్రుతి: ప్రాణాది దశవాయవః అన్నమయకోశే యదావర్తంతే తదా ప్రాణమయః కోశః.

తా॥ ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన - నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములనెడు దశవిధప్రాణవాయువులు స్థూలదేహమునందుండునపు డదే ప్రాణమయకోశ మనఁబడును.

శ్లో॥ ఏతేప్రాణాదయః పంచ పంచకర్మేంద్రియై స్సహ
భవేత్ ప్రాణమయఃకోశః స్థూలో యేనైవ చేష్టతే.

తా॥ ప్రాణపంచకము, కర్మేంద్రియపంచకము గూడి ప్రాణమయకోశ మనఁబడును.

ఈ కోశమం దాత్మయున్నపుడు భ్రమగల్గి క్షుత్పిపాసలు ప్రతీతియగుచుండును.

## 3. మనోమయకోశము :

సూ॥ ఏత త్కోశద్వయసంయుక్త ఆత్మా మన ఆది చతుర్దశకరణైః శబ్దాది విషయ సంకల్పాది ధర్మాన్ యదాకరోతి తదా మనోమయకోశః.

తా॥ అన్నమయ, ప్రాణమయకోశములు రెంటితోఁగూడి మనస్సు మొదలగు పూర్వోక్తములగు పదునాలుగు ఇంద్రియములచేతను - శబ్దస్పర్శాదివిషయసంకల్పము మొదలగు ధర్మములను చేయుటయే మనోమయకోశ మనఁబడును.

శ్లో॥ మనో మనోమయఃకోశో భవేత్ జ్ఞానేంద్రియై స్సహ
ప్రాచుర్యం మనసోయత్ర దృశ్యతేఽసౌ మనోమయః.

తా॥ జ్ఞానేంద్రియములైదును, మనస్సును మనోమయకోశ మగును. శ్రోత్ర త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములను జ్ఞానేంద్రియపంచకము మనస్సుతోఁగూడిన మనోమయకోశమగును.

ఈ కోశమం దాత్మయున్నపుడు కోశముతో ఏకత్రభ్రమగలిగి దేహమునాది, గృహమునాది, పుత్రులునావారు - అని ప్రతీతియగుచుండును.

## 4. విజ్ఞానమయకోశము :

ఈ విజ్ఞానమయకోశమును బుద్ధిమయకోశ మందురు.

సూ॥ ఏతత్కోశత్రయ విశిష్టాంతఃకరణే తద్గత విశేషధ్యానమననాదివృత్తయో యదా ఉత్పద్యంతే తదా విజ్ఞానమయః కోశః.

తా॥ పైమూఁడుకోశములతోఁగూడిన అంతఃకరణమందు శబ్దాదివిషయవిశేషములను - అందలిమేలుకీళ్ళను చక్కఁగవిచారించి ఒకనిర్ణయమునకువచ్చు అంతఃకరణవృత్తులే విజ్ఞానమయకోశ మనఁబడును.

శ్లో॥ విజ్ఞానమయకోశస్స్యా ద్బుద్ధిర్ జ్ఞానేంద్రియై స్సహ
విజ్ఞానప్రచురత్వేనా ప్యాచ్ఛాదకతయాత్మనః
విజ్ఞానమయకోశోయ మితి విద్వద్భి రుచ్యతే.

తా॥ జ్ఞానేంద్రియములైదును, బుద్ధియును విజ్ఞానమయకోశమగును. ఇది జ్ఞానప్రాచుర్యము గలదిగనుకను, ఆత్మకు ఆచ్ఛాదనమగుటచేతను దీనిని విజ్ఞానమయకోశ మని పండితులు పలుకుదురు.

ఈ కోశమం దాత్మయున్నపుడు భ్రమగలిగి నేను జ్ఞానిని, మూఢుఁడను అను ప్రతీతి యగుచుండును.

శ్లో॥ కోశత్రయంమిళిత్వా తద్వపుస్స్యా త్సూక్ష్మ మాత్మనః.

తా. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములను మూఁడుకోశములుచేరి సూక్ష్మశరీరమగుచున్నది. దీనినే లింగశరీరమందురు.

## 5. ఆనందమయకోశము :

సూ॥ ఏతత్కోశచతుష్టయ కారణాజ్ఞానసంవృత్తం స్వకారణజ్ఞానం స్వరూప సుఖే వటధానాసు వటవృక్షఇవ యదావర్తతే - తదా ఆనందమయఃకోశః.

పై నాల్గుకోశములకు కారణమగు అవిద్య - లేక - అజ్ఞానముచే ఆవరింపఁబడిన తనకారణజ్ఞాన మానందరూపమగు బ్రహ్మమందు మఱ్ఱివిత్తనమందు వృక్షమువలె బీజ రూపముగా లీనమైయుండుటయే ఆనందమయకోశము.

శ్లో॥ కారణే సత్వమానంద మయోమోదాది వృత్తిభిః
తత్తత్కోశైస్తు తాదాత్మ్యా దాత్మాతత్తన్మయోభవేత్.

తా॥ కారణశరీరమందలి మలినసత్వగుణము ప్రజామోదవృత్తులతోఁగూడినదై ఆనందమయకోశమగును. ఆత్మ ఆ యా కోశములతోఁ గూడి ఆ యా కోశాభిమానము వలన ఆ యా కోశమయుఁ డని వ్యవహరింపఁబడుచున్నాఁడు. అనఁగా - 1. అన్నమయుఁడు, 2. ప్రాణమయుఁడు, 3. మనోమయుఁడు, 4. విజ్ఞానమయుఁడు, 5. ఆనందమయుఁడు అనునామములచే అలరారుచున్నాఁడు.

ఈ కోశమం దాత్మయున్నపుడు నేను సుఖవంతుఁడనను ప్రతీతి యగుచుండును.

ఈ పంచకోశములలో అన్నమయకోశము స్థూలదేహము - ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు మూఁడును సూక్ష్మదేహము - లేక - లింగదేహము- ఆనందమయకోశమే కారణదేహము - స్థూలదేహములెన్ని మాఱినను సూక్ష్మదేహము మాఱదు.

యజుర్వేదీయమగు తైత్తిరీయోపనిషత్తు భృగువల్లిలో ఈ పంచకోశముల వివరణము గలదు అందే - 1. అన్నం బ్రహ్మేతి విజానాత్ - 2. ప్రాణో బ్రహ్మేతి విజానాత్ - 3 మనో బ్రహ్మేతి విజానాత్ - 4 విజ్ఞానం బ్రహ్మేతి విజానాత్ - 5. ఆనందో బ్రహ్మేతి విజానాత్ - అని పంచకోశప్రాశస్త్యము ప్రకటింపఁబడినది. ఈ సూత్రముల క్రింద శ్రీ శంకరభగవత్పాదుల, శ్రీమాన్ రంగరామానుజుల వివరణలు చూడఁదగినవి.

## పంచమలములు

1. ఆణవమలము - 2. కార్మికమలము - 3 మాయికమలము - 4. మాయేయ మలము - 5. తిరోధానమలము.

### 1. ఆణవమలము:

పరమాత్మను తెలిసికొనవలయునను తలంపు కలుగఁగా దానిని మఱుఁగుపఱుచు నది - ఆణవమలము.

### 2. కార్మికమలము:

పెద్దలవలన వేదాంత రహస్యములను తెలిసికొనునపుడు వానియందు బుద్ధిని ప్రవేశింపనీయనిది - కార్మికమలము.

### 3. మాయికమలము:

ఇది గాఢమైన అజ్ఞానము - పాపకార్యములయందు బుద్ధిని ప్రవేశింపఁజేయునది- మాయికమలము.

### 4. మాయేయమలము:

మాయాసంబంధములగు దుష్టకృత్యములయందు బుద్ధిని ప్రవేశింపఁజేయునది - మాయేయమలము.

### 5. తిరోధానమలము:

సత్యమైన పరమాత్మయందు అసత్యభ్రాంతిని పుట్టించి పరమాత్మ నెఱుఁగ నీయక చేయునది - తిరోధానమలము.

## భంగ్యంతరము

శ్లో॥ అణవం గర్భసంబంధ మణురూప వ్యవస్థితమ్
మాయికం జాతిభేదంచ మోహ ఇత్యభిధీయతే
కార్మికం ద్రవ్యసంబంధ మీషణత్రయ సంయుతమ్
ఇదం మలత్రయం దోషం గురుణైవ విమోచయేత్.

1. అణవమలము: తలిదండ్రుల శుక్లశోణిత సంబంధముచేతను, గర్భవాససంబంధముచేతను సంక్రమించినమలము - అణవమలము.

2. మాయికమలము. జాతి, విద్యాహంకారాది మోహములకుఁగారణమైనట్టి పాప రూపమే - మాయికమలము.

3. కార్మికమలము. అనుభవవస్తుసంబంధముచేతను, ఈషణత్రయ దోషదూషిత మగుటచేతను సంప్రాప్తించునది - కార్మికమలము.

ఈ మలత్రయము గురునిచే విడిపింపఁజేసికొనవలె.

విశేషము. పైవానితోపాటు 1. వాచిక, 2. కాయిక, 3. మానసికమలములని మఱి మూఁడిటఁ గలిపిరి.

## 1. వాచికమలము:

శ్లో॥ పారుష్య మనృతం చైవ పైశున్యం చాపి సర్వశః
అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మలం స్యా చ్చతుర్విధమ్.

తా. పరహృదయములకు బాధాకరముగా పరుషముగా మాటలాడుటయు, అసత్యములాడుటయు, ప్రతివారియం దేదోయొక దోషమారోపించుటయు, అనుచిత ప్రసంగములు గావించుటయునను ఈనాల్గుదోషములు గలది వాచికమలము.

## 2. కాయికమలము:

శ్లో॥ అదత్తానా ముపాదానం హింసా చైవా విధానతః
పరదారోపసేవాచ శారీరం త్రివిధం స్మృతమ్.

తా. 1. పరుల ద్రవ్యమును అన్యాయముగాఁ దీసికొనుట - 2 శాస్త్రదూష్యములు, హింసాపూరితములగు పనులుచేయుట - 3. పరస్త్రీలతో సంబంధము గలిగి యుండుట - అను ఈదోషత్రయము కలది కాయికమలము.

## 3. మానసికమలము:

శ్లో॥ పరద్రవ్యే ష్వభిధ్యానం మనసానిష్టచింతనమ్
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసమ్.

తా. 1. నిరంతర పరద్రవ్యాభిలాష - 2. అనవరత మితరులకు కీడుతలపోయుట - 3. వ్యర్థవిషయములందు ప్రవేశింప పూనుకొనుట - అను ఈ దోషత్రయము కలది మానసికమలము.

# పంచక్లేశములు

1. అవిద్య - 2. అస్మితము - 3. రాగము - 4. ద్వేషము - 5. అభినివేశము ఈ అయిదు కష్టదాయకములగుటచే పంచక్లేశము లని పెద్దలందురు.

# పంచభ్రమలు

## అధర్వణీయ అన్నపూర్ణోపనిషత్

శ్లో॥ జీవేశ్వర జగద్భేదో జగద్భేదశ్చ పంచధా
భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే.

1. భ్రమ:

శ్లో॥ జీవేశ్వరౌ భిన్నరూపా వితి ప్రాథమికోభ్రమః.

తా. జీవేశ్వరులు భిన్నరూపు లనుకొనుట మొదటిభ్రమ.

—ఈభ్రమ నివృత్త్యుపాయము

"బింబప్రతిబింబ దర్శనేన భేదభ్రమో నివృత్తిః"

భాష్యము: ఈశ్వరుఁడు బింబము - జీవుఁడుప్రతిబింబము - ప్రతిబింబము అసత్యము- బింబము సత్యము కనుక జీవేశ్వరు లిరువురు నొక్కటియే భిన్నులుకారు.

2. భ్రమ:

శ్లో॥ ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః.

తా. నాకు కర్తృత్వము కలదనుకొనుట ద్వితీయభ్రమ. ప్రారబ్ధానుసారముగా ఇంద్రియములు వ్యాపారముచేయుచుండఁగా ఇంద్రియాతిరిక్తమైన ఆత్మ కర్తగాఁ దోఁచుచున్నది.

—ఈభ్రమ నివృత్త్యుపాయము—

"స్ఫటికలోహితదర్శనేన పారమార్థిక కర్తృత్వభ్రమో నివృత్తిః"

భాష్యము. నీల, పీత, రక్తాది వస్తువుల సాన్నిధ్యముచే స్ఫటికము ఆయారంగులు గలిగియుండుటయందు దానికర్తృత్వమేమియులేక రంగుల కర్తవ్యమైనట్లు ఇంద్రియ సాన్నిధ్యమున ఆత్మ కర్తగాక ఇంద్రియములే కర్తలని తెలిసికొనవలెను.

3. భ్రమ:

శ్లో॥ శరీరత్రయసంయుక్త జీవస్సంగీ తృతీయకః.

తా. తాను దేహత్రయము నంటికొనియున్నాననుకొనుట మూఁడవభ్రమ

—ఈభ్రమ నివృత్త్యుపాయము—

ఘట, మఠాకాశ దర్శనేన సంగతిభ్రమో నివృత్తః.

భాష్యము. ఘట, మఠాకాశదృష్టాంతముచే ఈభ్రమ తొలఁగును ఆకాశము ఘట, మఠాదులనంటకయుండినట్లు దేహత్రయమునంటక ఆత్మయున్నట్టు తెలియంగవలయును. చైతన్యరూపమైన ఆత్మ దేహత్రయము నంటియున్న యెడల దేహమెప్పటికి అచేతనము గానేరదు.

4. భ్రమ:

శ్లో॥ జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః.

తా. జగత్కారణరూపుఁడైన సర్వేశ్వరునకు వికారము గలదనుట నాలుగవ భ్రమ

—ఈ భ్రమ నివృత్త్యుపాయము—

కనకరుచిదర్శనేన వికారిత్వభ్రమో నివృత్తః.

భాష్యము: ఈభ్రాంతి కనకభూషణ దృష్టాంతముచే నివర్తింపఁబడును వికారములు భూషణములకేకాని బంగారమునకు లేనట్లు వికారములు దేహములకేగాని ఆత్మకులేవు.

5. భ్రమ:

శ్లో॥ కారణాద్భిన్నజగత స్సత్యత్వం పంచమోభ్రమః.

తా. బ్రహ్మముకంటె భిన్నమైన జగత్తు సత్యమనుట అయిదవ భ్రమ.

—ఈ భ్రమ నివృత్త్యుపాయము—

రజ్జుసర్పదర్శనేన కారణాద్భిన్నజగతస్సత్యత్వభ్రమో నివృత్తః.

భాష్యము రజ్జుసర్పదృష్టాంతముచే ఈ భ్రాంతి తొలంగును.

రజ్జువును తెలిపికొనవఱకును సర్పభ్రాంతి గలదు. దానినెఱింగిన పిదప సర్పములేనట్లు సర్వవ్యాపకమైన బ్రహ్మమును తెలిపికొనిన పిదప దేహాదిప్రపంచము

మిధ్యయగును సృష్టికిపూర్వమున - ప్రళయమునకుపిదప లేని ఈజగత్తు మధ్య యందును లేదనియే చెప్పవలెను.

## పంచభ్రమములు

1. దేహాత్మభ్రమ. దేహముకాని తన్ను దేహమని తలంచుట.

2. తరుపాషాణాదిభ్రమ. దేవుఁడుగాని తరుపాషాణాది విగ్రహములను దేవుఁడని తలంచుట.

3 మిథ్యాత్మభ్రమ: ఆత్మకాని శరీరాదులను ఆత్మయని తలంచుట.

4. దేవతాభ్రమ: మోక్షప్రదమగు ఆత్మ తనలోనుండఁగా దేహేంద్రియాదులతోఁ గూడిన బ్రహ్మాదులను మోక్షకర్తలని తలంచుట.

5. కర్మభ్రమ. బ్రహ్మాభిన్నస్వరూప ప్రత్యగాత్మ తానై యుండుటను తెలిసికొనక తనకు మోక్షముకావలెనని తలంచి జప, తప, వ్రతాదుల ననుష్ఠింపతలంచుట.

[శ్రీకంఠ భాష్యము]

## జ్ఞానభూమికలు :

సూచన

[ఈజ్ఞానభూమికలు సామవేదీయ మహోపనిషత్తులోను, యజుర్వేదీయ వరాహోపనిషత్తులోను సవివరముగాఁగలవు—]

శ్లో॥ జ్ఞానభూమి శ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా
విచారణా ద్వితీయాఖ్యా తృతీయా తనుమానసీ
సత్వాపత్తి శ్చతుర్థీస్యా త్తతోఽసంసక్తిస్తు పంచమీ
పదార్థాభావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా.

1. శుభేచ్ఛా:

దీనినే శుభేచ్ఛయనియు నందురు.

శ్లో॥ స్థితః కిమ్మూఢఏవాస్మి ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః.

తా. నేనేమెఱుఁగని మూఢుఁడను - శాస్త్రముల, సజ్జనులమూలమున తత్వార్థములఁదెలియఁగలననెడి వైరాగ్యపూర్వమైన యిచ్ఛయే సుభేచ్ఛ - లేదా - శుభేచ్ఛ.

## 2. విచారణ:

శ్లో॥ శాస్త్ర, సజ్జనసంపర్క- వైరాగ్యాభ్యాసపూర్వకమ్
సదాచారప్రవృత్తి ర్యా ప్రోచ్యతే సా విచారణా

తా. శాస్త్రముల, సత్పురుషులసాంగత్యమును - వైరాగ్యాభ్యాసపూర్వకముగాఁ గల్గిన సదాచారప్రవృత్తి - విచారణ.

## 3. తనుమానసి:

శ్లో॥ విచారణా సుభేచ్ఛాభ్యా మింద్రియార్థేషు రక్తతా
యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసీ.

తా. సుభేచ్ఛా, విచారణలను రెండుభూమికలచేత విషయాభిలాష లెప్పుడు తగ్గునో అపు డది తనుమానసి - ఈమూఁడుభూమికలు జగద్వ్యాపారముగలవిగాన జాగ్రదవస్థయనఁదగును. ఇంతవఱకు జన్మ గలదు. తక్కిన భూమికలయందు జన్మలేదు.

## 4. సత్వాపత్తి:

శ్లో॥ భూమికా త్రితయాభ్యాసా చ్చిత్తేతు విరతే ర్వశాత్
సత్వాత్మని స్థితే శుద్ధే సత్వాపత్తి రుదాహృతా.

తా సుభేచ్ఛ, విచారణ, తనుమానసి భూమికలయొక్క అభ్యాసమువలన విషయములందు వైరాగ్యముగలిగి అందువలన చిత్తము శుద్ధమై సచ్చిదానందరూపమైన ఆత్మసాక్షాత్కారముండుటయే - సత్వాపత్తి - ఈ భూమికయందు జగత్తు స్వప్నమువలెఁదోఁచును ఇది స్వప్నావస్థ. ఇతఁడు బ్రహ్మవిదుఁడు.

## 5. అసంసక్తి:

శ్లో॥ దశా చతుష్టయాభ్యాసా దసంసర్గ ఫలాతు యా
రూఢసత్వచమత్కారా ప్రోక్తాసంసక్తి నామికా -
ఇయం సుషుప్తిరాఖ్యాతా హ్యత్రస్థో బ్రహ్మవిద్వరః.

తా. పైనాల్గుభూమికల యభ్యాసముచే ఫలాపేక్షలేకలముగా నాటుకొనిన సత్వగుణప్రకాశము - అసంసక్తి - ఇది సుషుప్త్యవస్థ - ఇతఁడు బ్రహ్మవిద్వరుఁడు.

6. పదార్థాభావన:

శ్లో॥ భూమికాపంచకాభ్యాసాత్ స్వాత్మారామతయా దృఢమ్
అభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్
చిరముద్బోధనా ధన్య ప్రయత్నైనైవ బుధ్యతి
పదార్థాభావనా నామ షష్ఠీభవతి భూమికా
జీవన్ముక్తి స్తుర్యదశా వరీయో బ్రహ్మవిస్తరః

తా॥ పై అయిదుభూమికలచేత ఆత్మయందు మిగుల రమించువాఁడై అంత ర్బహిఃపదార్థములయొక్క భావనగోచరములేనట్టియు - ఇతరులచే బోధింపఁబడు నపుడు మాత్రము కార్యములయందు ప్రవర్తించుస్థితియే - పదార్థాభావన. ఇది తురీయా వస్థ - ఇతఁడు బ్రహ్మవద్వరీయుఁడు

7. తురీయము-లేదా-తుర్యాతీతము

శ్లో॥ భూమిషట్క-చిరాభ్యాసాత్ భేదస్యానుపలంభనాత్
యత్స్వభావైకనిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యగాగతిః
విదేహముక్తి రాఖ్యాతా తుర్యాతీత దశాస్మృతా
కథితోయం బ్రహ్మవిద్వ రిష్ఠో దుర్లభో నృణాం
ఏతాబుద్ధిమతామేవ గోచరాజ్ఞానభూమయః.

తా. వెనుకటి జ్ఞానభూమికలాఱిటిని చిరకాలమభ్యసించుటవలన ప్రపంచాది భేదములు నశించి ఆత్మభావనయందే నెలకొనియుండునట్టి స్థితియేదియో అదియే తురీయ మనెడి యేడవభూమిక. ఇదే తుర్యాతీతావస్థ ఇతఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు. ఈ భూమికలేడును బుద్ధిమంతులకే గోచరించును

మూఁడుభూమికలతో ముక్తులగుటకు సంశయము లేదు నాల్గవభూమికలోనికి గృహస్థుఁడును రాఁగలఁడు. సన్యాసి యేడవభూమికవఱకును రాఁగలఁడు. ఎల్లరకు ముక్తి సమానమే.

శ్లో॥ భూమికాత్రితయం త్యక్త్వా భూమికాత్రితయం పునః
సప్తమీభూమి మాసాద్య యస్తిష్ఠే త్సహి పండితః.

తా. మూఁడుభూమికలు విడిచి, మూఁడుభూమికలు పొంది ఏడవ భూమిక నందినవాఁడే పండితుఁడు.

## అజ్ఞానభూమికలు

శ్లో॥ బీజజాగ్ర త్తథాజాగ్ర న్మహాజాగ్ర త్తథైవచ
జాగ్రత్స్వప్న స్తథాస్వప్నం స్వప్నజాగ్ర త్సుషుప్తికమ్.

తా. 1. బీజజాగ్రత్ - 2 జాగ్రత్ - 3 మహాజాగ్రత్ - 4. జాగ్రత్స్వప్నము - 5. స్వప్నము - 6. స్వప్నజాగ్రత్ - 7. సుషుప్తి అను నీ యేడును అజ్ఞానభూమికలనఁబడుచు మోహభేదమే యగును

### 1. బీజజాగ్రత్తు.

శ్లో॥ ప్రథమం చేతనం యత్స్యా దనాఖ్యం నిర్మలం చితః
భవిష్యచ్చిత్తజీవాది నామ శబ్దార్థభాజనమ్
బీజరూపస్థితం జాగ్ర ద్బీజజాగ్ర త్తదుచ్యతే.

తా. నామరూపాదికల్పన కధిష్ఠానమై నిర్మలచైతన్య రూపమగు ఆత్మకు పూర్వజన్మములందలి పాపకర్మాతిశయమువలన ఈపుట్టువులో ననుభవింపఁదగియున్న దేహాదికము, తద్భోగ్యవస్తువులు మొదలగునదంతయు సూక్ష్మమగు బీజరూపములో నుండి ఈ యాత్మనావరించుటయే బీజజాగ్రత్తనఁబడును. ఇది గర్భోత్పత్తికాలమందే తలిదండ్రుల శుక్లశోణితమిశ్రబిందువే ఉపాధిగాఁగల ఈ జీవుని ఆశ్రయించి యుండును.

### 2. జాగ్రత్తు:

శ్లో॥ నవప్రసూతస్యపరా దయం చాహ మిదం మమ
ఇతి యఃప్రత్యయ స్స్వస్థ స్తజ్జాగ్ర త్ప్రాగభావనాత్.

తా. తల్లిగర్భమునుండి వెలుపలికి రాఁగానే దేహమే తానని తలఁచుట - క్షుత్పిపాసాదికము, తల్లియని, ఇతరులని భేదమును గుర్తించుట మొదలగు అవిద్యావిశేషవైభవము జాగ్రత్తనఁబడును.

### 3. మహాజాగ్రత్తు

శ్లో॥ అయం సోహ మిదంతన్మే ఇతి జన్మాంతరోదితః
పీపరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్ర దితిస్ఫుటమ్.

తా. పూర్వజన్మసంస్కారముచే నేమగొప్పవాఁడను కావలెను. మంచి భోగ వస్తువుల ననుభవింపవలెను. ఇత్యాది సంకల్పముల నొనర్చుట మహాజాగ్రత్తన బడును

4. జాగ్రత్స్వప్నము

శ్లో॥ ఆరూఢ మథవారూఢం సర్వధా తన్మయాత్మకమ్
యజ్జాగ్రతో మనోరాజ్యం తజ్జాగ్రత్స్వప్న ఉచ్యతే.

తా. తన జన్మాంతర పాపపుణ్యములఁబట్టి ప్రబలమైన లేదా దుర్బలమై మనస్సు ఆయాకోరికలను కోరుచుండఁగా తాదాత్మ్యమునంది ఎట్లెట్లు మనస్సుత్రిప్పునో అట్లట్లు సంచరించును. ఇదియే జాగ్రత్స్వప్నమనఁబడును.

5. స్వప్నము

శ్లో॥ అల్పకాలం మయాదృష్ట మేతన్నో దేతి యత్రహి
పరామర్శః ప్రబుద్ధస్య సస్వప్నఇతి కథ్యతే.

తా. స్వప్నమందనుభవింపఁబడు క్షణికసుఖదుఃఖములను జూచి మేల్కొనపుడు గూడ అట్టి క్షణికసుఖముల కొఱకు తెలివిలేక నిరంతరము పాటుపడుటయే స్వప్నమనఁబడును.

6. స్వప్నజాగ్రత్త

శ్లో॥ చిరసందర్శనాభావా దప్రఫుల్లం బృహద్వచః
చిరకాలానువృత్తి స్తు స్వప్నోజాగ్ర దివోదితః
స్వప్నజాగ్రదితిప్రోక్తం జాగ్రత్యపి పరిస్ఫురత్.

తా. ఇతరుల భోగభాగ్యములను చిరకాలముచూచి తానుగూడ అట్టివాఁడన గావలెనని దురాశపుట్టి నిరంతర మా యైశ్వర్యాదులనే ధ్యానించుచు తనకవి లేకపోయెనను బాధతోనుండుటయే స్వప్నజాగ్రత్తనఁబడును

7. సుషుప్తి

శ్లో॥ షడవస్థాపరిత్యాగే జడాజీవస్య యాస్థితిః
భవిష్యద్దుఃఖబోధాఢ్యా సుషుప్తి స్సోచ్యతేగతిః
జగత్తస్యా మవస్థాయా మంత స్తమపి లీయతే

తా. మోహభేదము లాటింటిలో క్రమముగా మునింగిపోయి అందువలన దుఃఖ మనుభవమునకురాంగా అపుడేమియు చేయుటకును దోంచక జడునివలెనుండి ఇంకను మునుముందు దుఃఖములు రానున్నవని తెలిపి కటికచీంకటిలో తిరుగువానివలె నుండుటయే సుషుప్తియనంబడును.

## అవస్థాచతుష్టయమ్

1. జాగ్రత్తు - 2. స్వప్నము - 3 సుషుప్తి - 4. తురీయము.

### 1. జాగ్రదవస్థ

సూ॥ కా జాగ్రదవస్థా? మన ఆది చతుర్దశకరణైః పుష్కలైరాదిత్యాద్యను గృహీతైః శబ్దాదీన్విషయాన్ స్థూలా న్యదోపలభతే త దాత్మానో జాగరణమ్

తా. కర్మేంద్రియములైదు - జ్ఞానేంద్రియములైదు - అంతఃకరణ చతుష్టయము అను ఈ పదునాలుగు ఆయా అధిష్ఠానములతోంగూడి స్థూలములగు శబ్దాదిబాహ్య విషయములను ఎపుడు గ్రహించునో అపుడు జాగ్రదవస్థ అనంబడును.

### 2. స్వప్నావస్థ.

సూ॥ కా స్వప్నావస్థా? తద్వాసనాసహితైః చతుర్దశకరణైః శబ్దాద్యభావేపి వాసనామయాన్ శబ్దాదీన్ తాత్కాలికాన్ ప్రతిభాసమానాన్ యదా ఉపలభతే తదా స్వప్నమ్.

తా. శబ్దాది విషయములు లేకున్నను తత్కాలమందు ప్రతిభాసించు జాగ్రద్వాసనామయములగు శబ్దాదులను జాగ్రద్వాసనాసహితములగు పై పదునాలుగు ఇంద్రియములతోను బాహ్యమందుంగాక అంతఃకరణమందే యెపుడుగ్రహించునో అది స్వప్నావస్థ అనంబడును

### 3. సుషుప్త్యవస్థ

సూ॥ కా సుషుప్తావస్థా? చతుర్దశకరణోపరమాత్ విశేషవిజ్ఞానాభావాత్ యదా శబ్దాదీన్ విషయాన్ నోపలభతే తదాత్మన స్సుషుప్తిః.

తా. చతుర్దశేంద్రియములును తమ కారణమందు లయమందుచున్నందున శబ్దాది విషయములను బాహ్యమందుంగాని అంతఃకరణమందుంగాని గ్రహించుటకు ప్రవృత్తి లేకుండుటచే ఆయా శబ్దాది విశేషజ్ఞానము కలుగనేరదు. అట్టి స్థితియే సుషుప్త్యవస్థ అనంబడును.

4. తురీయావస్థ

సూ॥ కిం తురీయం? అవస్థాత్రయ భావాభావ సాక్షిస్వయంభావాభావ రహిత నిరంతరచైతన్య మాత్రం యదా తత్తురీయమ్.

తా. అవస్థాత్రయమునకు సాక్షిమాత్రమును, స్వయముగా తనకెట్టి భావాభావములు లేనట్టి చైతన్యము మాత్రమే తురీయమనఁబడును.

శ్రుతిః నాభి, హృదయ, కంఠ, మూర్ధసు - జాగ్ర, త్స్వప్న, సుషుప్తి, తురీయవస్థాః.

తా నాభియందు జాగ్రదవస్థ - హృదయమందు స్వప్నావస్థ - కంఠమందు సుషుప్త్యవస్థ - మూర్ధమందు తురీయావస్థ ఉండును. [పరబ్రహ్మోపనిషత్

శ్రుతి: జాగరతే బ్రహ్మే, స్వప్నే విష్ణు, స్సుషుప్తౌ రుద్ర, స్తురీయ మక్షర చిన్మయమ్. [పరబ్రహ్మోపనిషత్

తా. జాగ్రదవస్థలో బ్రహ్మ, స్వప్నావస్థలో విష్ణువు, సుషుప్త్యవస్థలో రుద్రుఁడు తురీయావస్థలో అక్షరుఁడగు చిన్మయుఁడుండును.

## శ్రవణ, మనన, నిదిధ్యాసలు

1. శ్రవణము

శ్లో॥ సర్వవేదాంతవాక్యానాం షడ్భి ర్లింగై స్తదద్వయే
పరేబ్రహ్మణి తాత్పర్య నిశ్చయం శ్రవణం భవేత్.

తా 1. ఉపక్రమము, 2 ఉపసంహారము. 3 అభ్యాసము. 4. అపూర్వత ఫలము, 5. అర్థవాదము, 6. ఉపపత్తి, అను నీ యాఱులింగములతో సత్యజ్ఞానానంద నందబ్రహ్మమందే అన్ని వేదాంతములకు పరమతాత్పర్యమని నిర్ణయించుకొనువఱకు గురువులకడ విద్యనువినుటయే శ్రవణమనఁబడును

2. మననము.

శ్లో॥ వేదాంతవాక్యానుగుణ యుక్తిభి స్త్వనుచింతనమ్
మననం తచ్ఛ్రుతార్థస్య సాక్షాత్కారస్య కారణమ్.

తా. తాను శ్రవణముగావించిన వేదాంతవాక్యములనే లౌకికయుక్తులతో, దృష్టాంతములతో మనస్సులో గట్టిపడునట్లు చింతించుటయే మనన మనఁబడును. ఇది పరోక్షబ్రహ్మజ్ఞానము – అపరోక్షమగుటకు సాధనమగుచున్నది.

## 3. నిదిధ్యాస

శ్లో॥ విజాతీయ శరీరాది ప్రత్యయత్యాగ పూర్వకమ్
సజాతీయాత్మవృత్తీనాం ప్రవాహీకరణం యథా
తైలధారావ దచ్ఛిన్న వృత్త్యా తద్ధ్యాన ముచ్యతే

తా. దేహాదికమే నేనను విజాతీయ వ్యవహారజ్ఞాన వృత్తుల ఏమాత్రము రానీయక బ్రహ్మమే నేనను వృత్తిని మాత్రమే అంతఃకరణమందు అవిచ్ఛిన్నతైలధార వలె నుంచుటయే ధ్యానము – లేక – నిదిధ్యాసన మనఁబడును.

## చతుర్విధగురుశుశ్రూషలు

1. స్థానశుశ్రూష – 2. అంగశుశ్రూష – 3. భావశుశ్రూష – 4. ఆత్మశుశ్రూష– ఇవి ఉత్తరోత్తరములు బలీయములు.

## సప్తభూమికలు

శ్లో॥ శాస్త్రతత్వజ్ఞసంపర్కో విచారోఽసంగభావనా,
సమతా, స్వచ్ఛతా, సౌమ్యా, తుర్యగా – సప్తభూమికాః.

## 1. శాస్త్రతత్వజ్ఞసంపర్కము:

తత్వజ్ఞాని సమక్షమున వేదాంతశాస్త్రాభ్యాసము చేయుచు వైరాగ్యముగలిగి యుండుట ప్రథమభూమిక. ఇది ముముక్షత్వము నిచ్చుచున్నది.

## 2. విచారము.

ఆత్మానాత్మవిచారణచేయుట రెండవభూమిక.

## 3. అసంగభావన

దారేషణ, పుత్రేషణ, ధనేషణ వదలుట మూఁడవభూమిక.

## 4. సమత.

లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలు విడచుట నాల్గవభూమిక.

5. స్వచ్ఛత.

శుద్ధ సంవిద్రూపానందములో నుండుట అయిదవభూమిక.

6. సౌమ్య

నగమునిద్ర, నగము మెలఁకువవలె నుండునట్టిస్థితి ఆఱవభూమిక. ఇది జీవన్ముక్తావస్థ.

7. తుర్యగ.

కేవల సుషుప్తితో సమానమైన స్థితి గలిగి అఖండానందము ననుభవించునది యేడవభూమిక - ఇదిముక్తావస్థ.

## సృష్టి

—సూక్ష్మప్రకృతిని స్థూలమొనర్చుటయే సృష్టి—

1. అండజములు

గ్రుడ్డువలన పుట్టునట్టివి పక్షులు, మత్స్యములు, సర్పములు మున్నగునవి.

2. స్వేదజములు.

చెమటవలన పుట్టునట్టివి పేలు, చీరపేలు మొదలగునవి.

3. ఉద్భిజ్జములు.

విత్తనములచే భూమిని పెల్లగించుకొనివచ్చునవి వృక్షాదులు, ఉసిళ్ళు, చీమలు మొదలగునవి.

4. జరాయుజములు

మావివలన పుట్టునట్టివారు మనుష్యులు, పశువులు మొదలగునవి.

అష్టపాశములు

శ్లో॥ ఘృణా, శంకా, భయం, లజ్జా జుగుప్సా చేతి పంచమమ్
కులం, శీలంచ, విత్తంచే త్యష్టౌ పాశాః ప్రకీర్తితాః.

తా॥ దయ, శంక, భయము, లజ్జ, నింద, కులము, శీలము, విత్తము - ఈ యెనిమిది అష్టపాశములు - ఈయెనిమిదిగలవాఁడు బద్ధుఁడు.

## షట్కర్మలు:

శ్లో॥ ధౌతి, ర్వస్తి, స్తథానేతి, స్త్రాటనం, నౌలికా తథా
కపాలభాతి రేతాని షట్కర్మాణి ప్రచక్షత.

తా॥ ధౌతి, వస్తి, నేతి, త్రాటనము, నౌలిక, కపాలభాతి - ఇవి షట్కర్మలు- ఈయాఱు యోగసాధనలవలన మనసు విశ్రాంతినొందును - మనోవిశ్రాంతియనునదే బ్రహ్మానందము.

## షడూర్మ్మలు

1. జననము, 2. మరణము, 3. ఆఁకలి, 4. దప్పిక, 5. సంతోషము, 6. శోకము - ఇవి సంసారసాగరమునకు అలలవంటివిగాన ఊర్మ్మలనఁబడెను

## షడ్భావ వికారములు

1. అస్తి = పిండరూపముతో గర్భమందుండుట
2. జాయతే = జననమగుట.
3. వర్థతే = పెరుగుట.
4. విపరిణమతే = బాల్య, యౌవన, కౌమార, వార్థక్యములుగా నుండుట.
5. అపక్షీయతే = కృశించుట.
6. నశ్యతి = కనపడకపోవుట - (నశించుట.)

## మానసికపూజాకుసుమములు

1. మనస్సు - 2. బుద్ధి - 3. వాక్కు - 4. శమము - 5. దమము - 6. అక్రోధము - 7. మౌనము - 8. నిరాహారము - 9. నిద్రాత్యాగము - 10. భూత దయ - 11. అభినివేశము - 12. నైర్మల్యము - 13. అచాంచల్యము - 14. వేదాంత విచారము - 15. బ్రహ్మజ్ఞానము - 16. ఆనందము - ఇదియే బ్రహ్మము - "ఆనందో బ్రహ్మ" అని శ్రుతులు.

# దేహత్రయము :

స్థూల, సూక్ష్మ, కారణములని దేహములు మూఁడురీతులు.

శ్లో॥ స్థూల స్త్వన్నమయోదేహ స్సూక్ష్మ స్తద్వాసనామయః
మూలాజ్ఞానం త త్తదేవ శరీరం కారణాభిదమ్

—స్థూలదేహము - జాగ్రదవస్థ - విశ్వుఁడు—

తా॥ అన్నరసపరిణామరూపమైయిన చర్మము, మాంసము, రక్తము, మెదడు, క్రొవ్వు, శుక్లము, ఎముకలు - అనుసప్తధాతుమయమై క్షుత్పిపాసలు, జరామరణములు, భయభ్రాంతులను షడూర్మియుతమై.

సూ॥ పంచీకృతపంచమహాభూతైః కృతం సత్కర్మజన్యం సుఖదుఃఖాది భోగాయతనం శరీరం. 1. అస్తి - 2 జాయతే - 3. వర్ధతే - 4. విపరిణమతే - 5. అపక్షీయతే - 6. వినశ్యతీతి షడ్వికార మేతత్ స్థూలశరీరమ్

తా॥ పంచీకృతపంచమహాభూతములచే నిర్మింపఁబడి సుకృతదుష్కృతాదుల వలనగలిగిన సుఖదుఃఖాదుల ననుభవించుటకు గృహమువంటిదీ స్థూలశరీరము - ఇది ఉండుట, పుట్టుట, పెరుగుట, విరుగుట, తగ్గుట, చెడుట, అనునీయాఱువికారములు గలిగి విరాట్పురుష, జాగ్రదవస్థ సంజ్ఞలుగలదై యున్నది

సూ॥ స్థూలశరీరాభిమానీ ఆత్మా విశ్వ ఇత్యుచ్యతే.

తా॥ స్థూలశరీరాభిమానియైన ఆత్మ విశ్వుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

## సూక్ష్మదేహము - స్వప్నావస్థ - హిరణ్యగర్భుఁడు

సూ॥ అపంచీకృత పంచమహాభూతైః కృతం సత్కర్మజన్యం సుఖదుఃఖాది భోగసాధనం పంచజ్ఞానేంద్రియాణి, పంచకర్మేంద్రియాణి, పంచప్రాణాదయః, మనశ్చైకం, బుద్ధిశ్చైకా ఏవం సప్తదశకలాభిః సహయ త్తిష్ఠతి తత్ సూక్ష్మశరీరమ్.

తా॥ అపంచీకృతపంచమహాభూతములచే కలిగినదియు, కర్మచే సిద్ధించినదియు, సుఖదుఃఖాదిభోగములకు సాధనమైనదియు, కర్మ - జ్ఞాన - ప్రాణపంచకము - మనోబుద్ధులను పదునేడుకళలతోఁ గూడినదీ సూక్ష్మశరీరము.

సూ॥ సూక్ష్మశరీరాభిమానీ తైజస ఉచ్యతే.

తా. సూక్ష్మశరీరాభిమానియైన ఆత్మ తైజసుఁడనఁబడుచున్నాఁడు.

# కారణదేహము - సుషుప్త్యవస్థ - అవ్యాకృతుడు

సూ॥ అనిర్వాచ్యానాద్యవిద్యారూపం శరీరద్వయస్యకారణమాత్రం సత్ స్వస్వరూపాజ్ఞానం నిర్వికల్పకరూపం యదస్తి తత్కారణశరీరమ్.

తా॥ అనిర్వాచ్యమై, అనాదియై, అవిద్యాస్వరూపమై స్థూల - సూక్ష్మదేహములకు బీజభూతమై స్వస్వరూప అజ్ఞానమై నిర్వికల్పస్వరూపమేదియో అది కారణ శరీరము.

భాష్యము: ఇది సత్తుకాదు - సత్తని చెప్పినయెడల జ్ఞానమువలన నాశముకానేరదు. ఇది అసత్తుకాదు-అసత్తని చెప్పినయెడల మాయవలన జగదుత్పత్తికానేరదు. కనుక అనిర్వాచ్యము ఆద్యంతరహితమైనదికనుక అనాది అజ్ఞానవృతమైనదికనుక అవిద్యాశబలితము.

సూ॥ కారణశరీరాభిమానీ ఆత్మాప్రాజ్ఞ ఇత్యుచ్యతే.

తా॥ కారణశరీరాభిమానియైన ఆత్మప్రాజ్ఞుఁడనఁబడుచున్నాఁడు.

ఇట్టి దేహత్రయములు తాననుకొనుటయే దేహాత్మభ్రాంతి. అట్టి భ్రాంతిచే సకల కర్మలు నేనే చేయుచున్నానని అహంకారమూఢుఁడైన జీవుఁ డనుకొనుచుండును.

జీవుఁడు: అవిద్యోపాధి [కార్యోపాధి] ఈజీవుఁడు ముివ్విధములు.

1. విశ్వుఁడు = స్థూలశరీరాభిమాని.

2. తైజసుఁడు = సూక్ష్మశరీరాభిమాని.

3. ప్రాజ్ఞుఁడు = కారణశరీరాభిమాని.

ఈశ్వరుఁడు: కారణోపాధి, మాయోపాధి, సర్వజ్ఞత్వము, సర్వనియంతృత్వము, సర్వకర్తృత్వము, సర్వభోక్తృత్వము మొదలగు గుణములు కలవాఁడు.

విరాట్టు. సకలజీవులయొక్క స్థూలశరీరములు విరాట్టనిపించుకొనును. స్థూల శరీరాభిమాని.

సూత్రాత్మ. అంతర్యామి సమష్టిశరీరాభిమాని సమష్టికారణశరీరాభిమాని.

వాసనాత్రయము:

1. లోకవాసన 2. శాస్త్రవాసన 3. దేహవాసన.

ముద్రాత్రయము :

1. భూచరి = నాసికాగ్రదృష్టి.
2. ఖేచరి = నాసామూలదృష్టి.
3. మధ్య = నాసామధ్యదృష్టి.

## గుణత్రయము :

సత్వ, రజ, స్తమోగుణములు మూఁడు.

1. సాత్వికము :

శ్లో॥ అహింసా, సత్య, మస్తేయ బ్రహ్మచర్యాఽపరిగ్రహాః
అక్రోధో గురుశుశ్రూషా శౌచ స్సంతోష ఆర్జవం
అమానిత్వ మదంభిత్వ మాస్తికత్వ మహింస్రతా
ఏతే సర్వగుణా జ్ఞేయా స్సాత్వికస్య విశేషతః.
[యజుర్వేదీయ శారీరకోపనిషత్]

తా॥ జీవహింస చేయకుండుట, నిజము పలుకుట, దొంగిలింపకుండుట, బ్రహ్మచర్యము, చేచాఁపకుండుట, కోపరహితమగుట, గురులసేవించుట, వెలుపల లోపల పరిశుద్ధత, సంతోషము, ఋజుభావము, గరువములేకుండుట, మోసకారి కాకుండుట, ఆస్తికత్వము, పరులహింసింపకుండుట మొదలగు మేలిగుణములతోఁ గూడినది సాత్వికము.

శ్లో॥ వైరాగ్యం, క్షాంతి, రౌదర్య మిత్యాద్యాస్సత్వసంభవాః

తా॥ వైరాగ్యము, ఓర్పు, ఉదారత మొదలగు సుగుణములన్నియు సత్వ గుణమువలనఁ గలుగును.

2. రాజసము :

శ్లో॥ అహం కర్తాఽ స్మ్యహం భోక్తాఽ స్మ్యహం వక్తాభిమానవాన్
ఏతే గుణా రాజసస్య ప్రోచ్యన్తే బ్రహ్మవిత్తమైః. [శారీరకోపనిషత్]

తా॥ నేను కర్తను, నేను భోక్తను, నేను వక్తను, నే నభిమానవంతుఁడను అనుగుణములెల్ల రాజసములని బ్రహ్మజ్ఞానశిఖామణులు చెప్పుదురు.

శ్లో॥ కామక్రోధౌ లోభయత్నా విత్యాద్యా రజసోత్థితాః

తా॥ కోరిక, కోపము, లుబ్ధత్వము, అభిలాష మొదలగునవి రజోగుణము వలనఁ గలుగును - మఱియు అసంతుష్టి, పరితాపము, ఓర్పులేకుండుట ఇత్యాదులు రాజసమునకు ముఖ్యములు.

3. తామసము

శ్లో॥ నిద్రాలస్యే మోహరాగౌ మైధునం చౌర్య మేవచ
ఏతేగుణా స్తామసస్య ప్రోచ్య న్తే బ్రహ్మవాదిభిః॥ [శారీరకోపనిషత్]

తా॥ నిదుర, సోమరితనము, మోహము, అనురాగము, మైధునము, దొంగతనము మొదలగు వికారములు తామసగుణమువలనఁగలుగునని బ్రహ్మవాదులు వక్కాణింతురు. మఱియు భ్రమ, అవివేకము, స్వప్నము, తొందరపాటు - ఇత్యాదులు తామసములు.

శ్లో॥ తామసా ద్రాజసం శ్రేష్ఠం రాజసా త్సాత్వికం మతమ్
సాత్వికా న్న పరం కించి దృతః కైవల్యభా గ్భవేత్.

తా॥ తామసకర్మకంటె రాజసకర్మ శ్రేష్ఠము. రాజసకర్మకంటె సాత్వికకర్మ శ్రేష్ఠము. సాత్వికకర్మవలన కైవల్యమును పొందునుగాన సాత్వికము కంటె మఱియొక మంచికర్మ లేదు.

## పాతిత్యత్రయము :

1. అర్ధప్రబుద్ధత్వము - 2. ఆరూఢపాతిత్యము - 3. వాచావివేకము - జ్ఞానాభ్యాసుల కీమూఁడువిధములైన పాతిత్యములు కలుగును.

### 1. అర్ధప్రబుద్ధత్వము :

సగము తెలిసి - సగము తెలియకుండుట - దీనినే మిడిమిడిజ్ఞానమందురు - సగము మేలుకొనుట అని దీని యర్థము.

వేదాంతశ్రవణము చేయునపుడు సచ్చిదానందరూపుఁడనగు నేను సాక్షాత్ పరబ్రహ్మము ననుకొని యితరవేళల ఆ వివేకము లేకుండుట.

### 2. ఆరూఢపాతిత్యము:

జ్ఞాననిష్ఠగలిగి తానుకర్తగానని తెలిసి అసంగోదాసీనుఁడై యుండి విధినిషేధములు మాని కేవలాత్మనిష్ఠనుండి మఱికొంతకాలమునకు అవిద్యావరణచే వర్ణాశ్రమాభి

మానియై కర్తృత్వంబువహించి ప్రపంచము సత్యముగా నెంచి విధినిషేధములు పాటించుట.

### 3. వాచావివేకము :

వేదాంతార్థపయిన పరతత్వముయొక్క నిష్కర్ష బాగుగా తెలియనేర్చి స్వానుభవములేక లోకవంచకుఁడై మాటలచే నెల్లర భ్రమింపఁజేయుచు శిష్యుల, భక్తుల - చేర్చుకొని వాచావైదగ్ధ్యముతో వారి విత్తముల నపహరించుచు బోధించుచుండుట.

## తాపత్రయము :

1. ఆధ్యాత్మికము - 2. ఆధిభౌతికము - 3. ఆధిదైవికము.

### 1. ఆధ్యాత్మికము

మనశ్శరీరాదులవలనఁగలిగినది - శోక, మోహ, జ్వరాదిదుఃఖము - ఆత్మ విషయకమైనది. స్థూలశరీర సంబంధమగు జ్వరము, తలనొప్పి మొదలగు బాధలఁ గూర్చియు, సూక్ష్మశరీర సంబంధమగు కామ, క్రోధాదులను గూర్చియు దుఃఖించుట.

ఇది స్థూలమునకు ముఖ్యముగా సంబంధించినదిగాన - విరాట్టు.

### 2. ఆధిభౌతికము

పృధివ్యాది భూతముల వలన గలిగినది. తనకంటె అన్యమైన పుత్ర, మిత్ర, కళత్రాదులకు వ్యాధులవలనఁ గలిగెడు బాధలకును, పశ్వాదిజంతువులకుఁ గలిగెడు బాధలకును, ధనాదులు పోవునపుడు గలిగెడు బాధలకును తాను విలపించుట.

ఇది సూక్ష్మశరీరసంబంధముగాన హిరణ్యగర్భుఁడు.

### 3. ఆధిదైవికము :

ఎండ, వాన, గాలి, పిడుగులు మొదలగువానిచేతను, పైశాచికాదులచేతను దుఃఖపడుట - ఇది కారణశరీరసంబంధము -

ఈమూడింటితోఁగూడినది మూలప్రకృతి - అనగా స్థూల, సూక్ష్మ, కారణ దేహరూపమైనది. దేహత్రయసంబంధమగు తాపత్రయమునకు అతీతమైయుండునది ఆత్మ. దీనినే అధియజ్ఞమని - సాక్షియజ్ఞమని తెలిసికొనవలెను.

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు పది, మనోబుద్ధిచిత్తాహంకారములు నాల్గు - ఈ పదునాలుగు అధ్యాత్మములు - వీనికి అధిభూతము అధిదేవత కలియకపోయినచో పనిచేయవు.

| అధ్యాత్మము | అధిభూతము | అధిదైవము |
|---|---|---|
| మనస్సు | మననము | చంద్రుఁడు |
| బుద్ధి | బోధ | బృహస్పతి |
| చిత్తము | చింతన | క్షేత్రజ్ఞుఁడు |
| అహంకారము | నేననుట | రుద్రుఁడు |
| శ్రోత్రము | శ్రవణము | దిక్కులు |
| త్వక్కు | స్పర్శము | వాయువు |
| చక్షువు | రూపము | అగ్ని |
| జిహ్వ | రుచి | వరుణుఁడు |
| ఘ్రాణము | గంధము | అశ్వినీదేవతలు |
| వాక్కు | వచనము | అగ్ని |
| పాణి | దానప్రతిగ్రహణములు | ఇంద్రుఁడు |
| పాదము | గమనాగమనములు | విష్ణువు |
| గుహ్యము | ఆనందము | ప్రజాపతి |
| గుదము | మలవిసర్జనము | యముఁడు |

## దీక్షాత్రయము :

1. దృగ్దీక్ష

చేఁపలు గ్రుడ్లుపెట్టి ఆగ్రుడ్లను తదేకదీక్షతోచూచి పిల్లలఁ గావించును.

2. స్పర్శదీక్ష :

పక్షులు గ్రుడ్లుపెట్టి తమరెక్కలక్రిందనుంచి పొదిగి పిల్లలఁ గావించును.

3. వాగ్దీక్ష

తుమ్మెదచేపట్టుకొనఁబడిన పురుగు భయముచేత ఆతుమ్మెదనే నిరంతరము ధ్యానించుటవలన తానుకూడ తుమ్మెదయగును. దీనిని భ్రమరకీటన్యాయము - కీటభృంగన్యాయ మందురు.

భాష్యము : భ్రమరము విజాతీయమగు ఒకపురుగునుదెచ్చి యొకవస్తువున కంటించి మట్టిపొదిగి తన ఝుంకారముచే నిరంతరము ప్రబోధించి ఆ పురుగును తనజాతిగా మార్చుకొనును.

(1) సద్గురువులగువారు తమతమ శిష్యులను మత్స్యములవలె చూచి తమంత వారిఁగా చేసికొనుట దృగ్దీక్ష యందురు.

(2) హస్తమస్తకసంయోగముచే స్పర్శించి, లలాటమునందుబూదిపూసి "విధివ్రాఁతవిఫలమగుఁగాక" అని తమంతవారిగా చేసికొనుట స్పర్శదీక్ష యందురు.

(3) భ్రమరము నాదబ్రహ్మోపాసనచే పరజాతీయములగు పురుగులను స్వజాతీయములను గావించుకొనునట్లు శిష్యులకు ప్రణవనాదోపాసనచేతను, వేదాంత శాస్త్రబోధచేతను, మహావాక్యధర్మప్రబోధముచేతను బోధగావించి తమంతవారిఁ గావించుకొని జననమరణదుఃఖప్రవాహవిముక్తులఁగావించుట వాగ్దీక్ష యందురు.

వేద వేదాంగపారంగతులై స్వస్వరూపానుసంధానకర్తలైన సద్గురువులకే ఈ దీక్షాప్రదానము శక్యమగును.

## నాడీత్రయము :

1. ఇడ - 2. పింగళ - 3. సుషుమ్న - వీనిని నాడీత్రయ మందురు.

శ్లో॥ దక్షిణే పింగళానాడీ వహ్నిమండలగోచరా
ఇడాచ వామనిశ్వాసే సోమమండలగోచరా
ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ
సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్.

తా॥ కుడిముక్కురంధ్రమునందు పింగళానాడి అగ్నిమండలగోచరమై యుండును - ఎడమముక్కు రంధ్రమునందు ఇడానాడి చంద్రమండలగోచరమై యుండును. ఇడా పింగళా నాడులకు నడుమ సూక్ష్మరూపముగా సుషుమ్నానాడి యుండును. దీనియందు సర్వప్రపంచము సుప్రతిష్ఠితమై యుండును.

ఈసుషుమ్నానాడినే 1. మధ్యనాళము - 2. బ్రహ్మరంధ్రము - 3 మేరుశిఖరము 4. అహోజ్యోతి అనియు నందురు.

శ్లో॥ దేహస్య పశ్చిమేభాగే వీణాదండ స్వరూపభృత్
దీర్ఘాస్థిమూర్ధ్నిపర్యంతం బ్రహ్మదండీతి కథ్యతే.

తా॥ శరీరము వెనుకటి భాగమందు వీణాదండమువలె శిరస్సునందలి సహస్రారమువఱకు వ్యాప్తమైన వెన్నెముకయే బ్రహ్మదండి యనఁబడును.

శ్లో॥ తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతు సూరిభిః

తా॥ ఆబ్రహ్మదండముచివర సూక్ష్మమైన రంధ్రమును బ్రహ్మరంధ్ర మందురు.

భాష్యము. ఈబ్రహ్మనాడి భ్రూమధ్యస్థానమందుండి జ్ఞాతకు నిలయమగును. ఇది మూలాధార స్వాధిషాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారము లను చక్రములందు ప్రవేశించి యుండును. ఈసుషుమ్నానాడికి అంతర్గతముగ కుండలినీశక్తి కలదు. ఇది కపాలమున ప్రవేశించి అచ్చటనుండి నాలుక చివరకు చేరి "సరస్వతి" అనుపేర ఒప్పుచున్నది. ఇదే భ్రూమధ్యమందు ఇడా, పింగళానాడులతో చేరి "త్రివేణీ సంగమ" మని "త్రికూట"మని "ఆజ్ఞా"చక్రమని పిలువఁబడుచున్నది.

ఇడానాడి జీవస్థానము - పింగళానాడి ఈశ్వరస్థానము - సుషుమ్నానాడి బ్రహ్మస్థానమని పరమహంసల పలుకులు.

## కర్మత్రయము :

1. సంచితకర్మ - 2. ప్రారబ్ధకర్మ - 3. ఆగామికర్మ - దీనినే క్రియమాణ కర్మమందురు.

### 1. సంచితకర్మ :

శ్లో॥ అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితమ్
సంచితం విలయం యాతి ప్రబోధాత్ స్వప్నకర్మవత్.

తా. నేను బ్రహ్మమునైతి ననెడి దృఢాపరోక్షజ్ఞానముకలవానికి శతకోటి కల్ప కాలము చేసిన సంచితకర్మము నిద్రనుండి మేల్కాంచినవానికి స్వప్నమందలి కర్మలు నశించునట్లు నశించును

"తత్వజ్ఞానేన సంచితమ్" తత్వజ్ఞానముచే సంచితము నశించునని శ్రుతులు పలికినవి.

సంచితకర్మమనఁగా జన్మాంతరములం దనుభవింపఁబడక మిగిలియుండునది - ఇందలి కొంతభాగమే రాఁగలజన్మమం దనుభవించునట్టిది ప్రారబ్ధమనఁబడును.

2. ప్రారబ్ధకర్మ:

ఇది మూఁడువిధములు - 1. ఇచ్ఛాప్రారబ్ధము - 2. అనిచ్ఛాప్రారబ్ధము - 3. పరేచ్ఛాప్రారబ్ధము.

అపథ్యదోషమువలన వచ్చునది ఇచ్ఛాప్రారబ్ధము.
రాజదండనాదులవలన వచ్చునది అనిచ్ఛాప్రారబ్ధము.
పరదాక్షిణ్యమువలన వచ్చునది పరేచ్ఛాప్రారబ్ధము.

శ్లో॥ అజరో స్మ్యమరోస్మీతి య ఆత్మానం ప్రపద్యతే
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా.

తా॥ నేను వార్ధక్యములేనివాఁడను. నేను మరణము లేనివాఁడను. అనియే బ్రహ్మజ్ఞాని తన్నుతాను పొందునో అట్టి బ్రహ్మవేత్తకు ప్రారబ్ధముయొక్క ఆరోపము కూడ సంభవింపదు. అనఁగా ప్రారబ్ధము బ్రహ్మవేత్తకుఁగలదని ఆరోపమునైన చేయఁగూడదని భావము.

పూర్వజన్మమందు చేర్చియుంచిన సంచితకర్మమునుండి యనుభవింపఁబడునది ప్రారబ్ధకర్మ. ఈ కర్మము నిశ్శేషముగా అనుభవింపఁబడకపోయినయెడల మిగిలిన సంచితముతోఁ జేరి మరల జన్మమును కలుగఁజేసి యనుభవింపఁజేయును. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధ మనుభవించియే తీరవలెనని పెద్దలసుద్దులు. ప్రారబ్ధనివృత్తి జ్ఞానులకుదక్క తదితరులకు సాధ్యముకాదు.

3. ఆగామికర్మ.

శ్లో॥ స్వ మసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభో యథా
నశ్లిష్యతే యతిః కంచిత్ కదాచిత్ భావికర్మభిః.

తా॥ బ్రహ్మవేత్తయైన యతి తన్ను సర్వసంగపరిత్యాగియైన బ్రహ్మమని తెలిసికొని ఆకాశమువలె స్వచ్ఛతచేతను, నిభృతచేతను, అసంగత్వముచేతను బ్రహ్మమాత్రుఁడై యుండుటవలన యతికి ఆగామికర్మ లంటవు.

శ్లో॥ ఆగామి ద్వివిధం నశ్యేత్ తద్వేష్య ప్రియవాదినోః.

తా॥ ఆగామికర్మ శత్రుమిత్రుల దూషణభూషణములవలన నశించును. శత్రులు దూషించి పాపమును, మిత్రులు భూషించి పుణ్యమును పట్టుకొని వెళ్ళుదురు పుణ్యపాపములు నశించినందున ఉత్తరమందు జన్మములేదు.

ఆగామికర్మమనఁగా వర్తమానకాలమందు చేయునట్టి కర్మములలో మిగిలి యుండునది. ఇదే రాఁగలజన్మమున అనుభవింపఁబడునట్టి సంచితములోఁ జేరునది.

శ్లో॥ జ్ఞానిన స్సర్వపాపాని జీర్యతే నాత్ర సంశయః
క్రీడన్నపి నలిప్యేత పాపై ర్నానావిధై రపి.

తా॥ జ్ఞానికి సకలపాపములు నశించుచున్నవి. సంశయములేదు. వానికి పలు విధములైన పాపములున్నను వాడు విషయలోలుఁడై యున్నను ఆపాపములు వాని ననుసరించుట లేదు.

## ఆత్మతత్త్వము:

శ్లో॥ అజ్ఞానావృతి, విక్షేప, ద్వివిధ జ్ఞానతృప్తయః
శోకోపగమ ఇత్యేతే యోజనీయా శ్చిదాత్మని.

తా॥ 1. అజ్ఞానము - 2. ఆవరణము - 3. విక్షేపము 4. పరోక్షజ్ఞానము - 5. అపరోక్షజ్ఞానము - 6 దుఃఖనివృత్తి - 7 తృప్తి అనునవి ఏడును ఆత్మకు అవస్థలు.

### 1. అజ్ఞానము:

శ్లో॥ సంసారసక్తచిత్త స్సం శ్చి దాభాసః కదాచన
స్వయం ప్రకాశకూటస్థం స్వతత్వం నైవ వేత్త్యయమ్.

తా॥ చిదాభాసుఁడగు జీవుఁడు సంసారమం దాసక్తిగల చిత్తముగలవాఁడై స్వప్రకాశమగు కూటస్థాత్మ తత్వమును గుర్తింపని స్థితియే అజ్ఞానము.

### 2. ఆవరణము:

శ్లో॥ నభాతి నాస్తికూటస్థ ఇతి వక్తి ప్రసంగతః.

తా॥ కూటస్థాత్మప్రసంగము పెద్దలు చేయునపుడు కూటస్థుఁడు లేఁడనియు, భాపించుట లేదనియు చెప్పుటయే ఆవరణము.

### 3. విక్షేపము:

శ్లో॥ కర్తా భోక్తా హమస్మీతి విక్షేపం ప్రతిపద్యతే.

తా॥ నేను కర్తను - ఈ పని నొనర్చుచున్నాను ఈ ఫలమును అనుభవించు భోక్తను అని తలఁచుచు బుద్ధినున్న కర్తృత్వాదులను కూటస్థాత్మయం దారోపించుటయే విక్షేపము.

4. పరోక్షజ్ఞానము:

శ్లో॥ అస్తి కూటస్థ ఇత్యాదౌ పరోక్షం వేత్తి వార్తయా.

తా॥ కూటస్థమగు ఆత్మగలదని గురు, శాస్త్రమూలమున గ్రహించుటయే పరోక్షజ్ఞానము.

5. అపరోక్షజ్ఞానము:

శ్లో॥ పశ్చాత్ కూటస్థ ఏవాస్మీ త్యేవం వేత్తి విచారతః.

తా॥ అనంతరము వేదాంతవాక్య మననాదులవలన తానే కూటస్థాత్మయను నిశ్చయమునం దుండుటయే అపరోక్షజ్ఞానము.

6. దుఃఖనివృత్తి:

శ్లో॥ కర్తా, భోక్తే త్యేవమాది శోకజాతం ప్రముంచతి.

తా॥ నేను కర్తనుగాను, భోక్తను గాను ఇత్యాది దుఃఖాదులను వదలుటయే దుఃఖనివృత్తి.

7. తృప్తి:

శ్లో॥ కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్త మిత్యేవ తుష్యతి.

తా॥ నేను బ్రహ్మవేత్త నగుటకు చేయఁదగిన దంతయు చేసితిని. ఇక నాకు చేయఁదగిన దేమియు లేదు. నేనే బ్రహ్మము నైతిని. సర్వవ్యాపకుఁడను, ఆనంద రూపుఁడను - నేనే అని తలఁచుటయే తృప్తి.

ఆత్మ:

అత సాతత్యగమనే అను ధాత్వర్థమునుబట్టి అతతి = సర్వత్ర నైరంతర్యేణ సర్వవస్తూని ప్రాప్నోతి ఇతి ఆత్మా - అంతట, అన్నింటియందు నిరంతరముగ వ్యాపించియుండునది ఆత్మ.

శ్లో॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః
మనసశ్చ పరా బుద్ధిః బుద్ధే రాత్మా మహాన్పరః. [కఠోపనిషత్]

తా॥ శబ్దాదివిషయములకంటె సూక్ష్మేంద్రియములు బలమైనవి. సూక్ష్మేంద్రియములకంటె మనస్సు బలమైనది. మనస్సుకంటె బుద్ధిబలమైనది. బుద్ధికంటె బల

మైనది ఆత్మ. ఈ యాత్మను ఆనందమయకోశములోఁ జేర్చిననాఁడే బ్రహ్మానందము సంభవించును. ఇట్టి ఆత్మశక్తిని పరికింపుఁడు.

1. అయమాత్మా బ్రహ్మ.

తా॥ ఇది అధర్వణవేదవాక్యము - అయమ్ = ఇంద్రియమాన సాదులకు విలక్షణముగా ప్రకాశించుచున్న - ఈ - ఆత్మా = ప్రత్యగాత్మ, బ్రహ్మ = కేవల అద్వితీయ అపరోక్ష స్వయంప్రకాశ పరబ్రహ్మము - అని ఈవాక్యార్థము.

2. అవినాశీ అరే ఆత్మా తం విజిజ్ఞానస్వ.

తా॥ అవినాశియగు ఆత్మ నెఱింగినచో ముక్తుఁడవు కాఁగలవు.

3. వాఙ్మనఃప్రాణదేహాదిభి ర్భిన్నో హ్యాత్మా.

తా॥ వాక్కు, మనస్సు, ప్రాణము, శరీరాదులకంటె ఆత్మ భిన్నమైనదిసుమా!

4. సర్వ మాత్మైవాభూత్.

తా॥ సర్వము ఆత్మస్వరూపమే ఆయెను.

5. నాహందేహో నేంద్రియా ణ్యంతరంగం
నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః
దారాపత్య క్షేత్ర విత్తాది దూర
స్సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్

తా॥ నేను దేహమును, ఇంద్రియములును, అంతరంగమును, అహంకారమును, ప్రాణసముదాయమును కాదు. భార్యాపుత్రులకు, భూధనములకు నిత్యము సాక్షిమాత్రుఁడనైన ప్రత్యగాత్మస్వరూపుఁడనగు పరమేశ్వరుఁడను నేను.

6. ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః [భగవద్గీత - 6, 1]

తా॥ ఆత్మను మనస్సుచేత నుద్ధరింపవలెను. ఆత్మను పతనము కానీయరాదు. అత్మకు ఆత్మయే బంధువు. ఆత్మకు ఆత్మయే శత్రువు.

7. మమాత్మా సర్వభూతాత్మా.

తనయందు నిఖిలభూతములందు ఒకేయాత్మయున్నదని - ఉండునని తలఁపవలయును.

8. మానవుఁడు ఇంద్రియారాముఁడుగాక ఆత్మారాముఁడు కావలెను.

9. ఏషమ ఆత్మాఽ న్తర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా, యవాద్వా సర్షపాద్వా, శ్యామకాద్వా, శ్యామాకతండులాద్వా -
ఏషమ ఆత్మా న్తర్హృదయే జ్యాయాన్ - పృథివ్యా జ్యాయాన్ -
అంతరిక్షా జ్జ్యాయాన్ - దివో జ్యాయా నేభ్యో లోకేభ్యః.

[ఛాందోగ్యము - 3 ప్రపాఠకం - 14-3]

తా॥ నా హృదయాంతరాళమున నున్న ఆత్మ - వ్రీహి, యవ, సర్షప, శ్యామాక ధాన్యములకంటెను, శ్యామాకతండులమునకంటెను మిక్కిలి సూక్ష్మము - ఈ నా ఆత్మయే భూమ్యాకాశములకంటె, ద్యులోకముకంటెను, మఱియు నన్నిలోకముల కంటెను పెద్దదై యున్నది.

10. అణోరణీయా న్మహతో మహీయా నాత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్ - తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుప్రసాదా న్మహిమాన మాత్మనః.

[కఠోపనిషత్ - 1-2-20]

తా॥ అత్యంతసూక్ష్మమైన అణువుకన్నను సూక్ష్మమైనదియు - అత్యంతవిశాలమైనదానికన్న విశాలమైనదియు అయిన ఆత్మ ప్రాణిసముదాయముయొక్క హృదయ గుహలో నివసించియున్నది.

కోరికలు లేనివాఁడు, కర్మకలాపమునుండి విరమించినవాఁడు, ఇంద్రియాదులను అతిక్రమించినవాఁడు - ఆవరణనైర్మల్యమువలన - ధాతుశీల ప్రసాదస్థితివలన ఆ ఆత్మను, ఆత్మమహిమను వేద్యమొనర్చుకొని దుఃఖరహితుఁ డగుచున్నాఁడు.

[ఈ మంత్రమే నారాయణోపనిషత్తులో 12 - అనువాకములో 1వ మంత్రముగాఁ గలదు.]

11. ఏష ఉ ఏవ వామనీ రేషహి స్సర్వాణి వామాని నయతి. సర్వాణి వామాని నయతి. య ఏవం వేద. [ఛాందోగ్యము - 4-15-3]

తా॥ ఆయాత్మయే వామనియనఁబడును. కారణమేమన? ఆత్మయే సర్వనామములను, శుభకర్మలను, సౌందర్యములను నడపును. ఆత్మ నిట్లెఱిఁగినవాఁడు సర్వశుభములను, శోభల నందును.

1. వ్రీహి = వడ్లు, ఎఱ్ఱవడ్లు.
2. యవలు = జవలు.
3. సర్షపము = ఆవాలు.
4. శ్యామకము, శ్యామాకము = చామలు

12. ఏషఉ భామినీ రేవహి సర్వేషు లోకేషు భాతి - సర్వేషులోకేషు భాతియ ఏవం వేద. [ఛాందోగ్యము - 4-15-4]

తా॥ ఈ యాత్మయే ప్రకాశించునది గాన భామినియనియుఁ జెప్పఁబడును. ఇదే సర్వలోకములందు భాసించును. ఇట్టి ఆత్మను దెలిసినవాఁడు లోకమున విరాజిల్లును.

13 తస్యహవా ఏతస్యైవం పశ్యతఏవం మన్వానస్యైవం విజానత ఆత్మతః ప్రాణ, ఆత్మత ఆశాఽఽత్మతః స్మరః ఆత్మత ఆకాశ, ఆత్మత స్తేజ, ఆత్మత ఆవిర్భావ తిరోభావా, వాత్మతోఽన్న, మాత్మతోబల, మాత్మతో విజ్ఞాన, మాత్మతోధ్యాన, మాత్మతశ్చిత్త, మాత్మతస్సంకల్ప, ఆత్మతోమన, ఆత్మతోవా, గాత్మతోనామా, ఽత్మతోమంత్రా, ఆత్మతః కిర్మ, ణ్యాత్మత ఏవేదం సర్వ మితి.

[ఛాందోగ్యము - 7-26-1]

తా॥ ఆశ, స్మృతి, ఆకాశము, తేజము, జలము, జననమరణములు, అన్నము, బలము, సంకల్పము, మనస్సు, కర్మలు మొదలగు సమస్తమాత్మయందే జనించునని తన్నుదా నెఱుఁగువాఁడు, లోచూపుగలవాఁడు, ఆత్మను ఆత్మతో స్పర్శింపఁజేయఁగలవాఁడు మాత్రమే నిజతత్వమును తెలిసికొనఁగలఁడు.

14 సోఽహమ్ - ఆ ఆత్మయే నేను - అనిధ్యానించుచే అజపామంత్రము. దీనినే ఆత్మమంత్రమనియు నందురు.

15. తద్యథేహ - య ఇహాత్మాన మనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్ కామాంస్తేషాం సర్వేషులోకేషు కామచారో భవతి. [ఛాందోగ్యము - 8-1-6]

తా॥ ఎవరీజన్మమున ఆత్మను సాక్షాత్కారము చేసికొందురో వారు పరలోకముల నన్నిట యథేచ్ఛగా విహరింపఁగలరు. వారికోరికలు పరిపూర్ణములగును.

16. స వా ఏష ఆత్మా హృది తస్యై తదేవ నిరుక్తం హృద్యయమితి
తస్మాత్ హృదయ మహరహర్ వా ఏవం విత్ స్వర్గంలోక మేతి.
[ఛాందోగ్యము - 8-33-]

తా॥ ఆయాత్మ హృదయమున నున్నది అందువలన హృదయము హృదయ మనఁబడుచున్నది. హృత్ = గుండెలో, అయం = ఈఆత్మ ఉన్నదని భావము - ఈ రహస్యమును గుర్తించినవాఁడు ఆత్మను ప్రతిదినము వెలుపలఁజూచుటకు బదులు హృదయమందే వెదకును - అతఁడే స్వర్గలోకమును బొందును.

17. గురువాక్య సముద్భూత స్వానుభూత్యాతి శుద్ధయా
యస్యాభ్యాసేన తేనాత్మా సతతం చావలోక్యతే.

తా॥ గురువాక్యముచేఁగలిగిన అతిపరిశుద్ధమైన స్వానుభవముచేతను, అభ్యాసము చేతను తనయందుండు ఆత్మను సదా చూచుచున్నాఁడు.

18. పూర్ణ మద్వయ మఖండచేతనం
విశ్వభేద కలనాది వర్జితం
అద్వితీయ పర సంవి దంశకం
త త్సదాహమితి మౌన మాశ్రయ.

తా॥ సంపూర్ణమైనది, సాటిలేనిది, అఖండజీవసంతమైనది, అఖిలభేదకల శూన్యమైనది, అద్వితీయ పరమ జ్ఞానస్వరూపమైనది - ఆత్మస్వరూపము - సర్వదా - సర్వథా అది నేనేయని మౌనమాశ్రయింపుము.

19. జన్మ మృత్యు సుఖదుఃఖ వర్జితం
జాతి నీతి కులగోత్ర దూరగం
చిద్వివర్త జగతో స్యకారణం
త త్సదాహమితి మౌన మాశ్రయ.

తా॥ జనన, మరణ, సుఖ, దుఃఖాదులు లేనిదియు, జాతి, నీతి, కుల గోత్రములు లేనిదియు - స్వప్రకాశపరివర్తనముచే ఈభౌతికప్రపంచమునకుఁ దానే కారణమైన ఆ ఆత్మ నేనేయని సర్వదా, సర్వథా సంభావించి మౌన మాశ్రయింపుము.

20. అప్సుదేవో మనుష్యాణామ్ దివిదేవో మనీషిణామ్
కాష్ఠలోష్ఠేషు మూఢానామ్ యుక్తస్యాత్మని దేవతా.

తా॥ సామాన్యజనులకు గంగాదితీర్థములే దేవతలు, స్వల్పజ్ఞానులగు పండితులకు స్వర్గవాసులగు ఇంద్రాదులే దేవతలు. పరమ మూఢులకు తరు, పాషాణ, లోహాది విగ్రహములే దేవతలు, యోగికి తనఆత్మయే దైవము.

21. సర్వంహ్యేతత్ బ్రహ్మ - అయమాత్మా బ్రహ్మే. [మాండూక్యము-1]

తా॥ ఈ చరాచరప్రకృతియంతయు బ్రహ్మమే - ఆ బ్రహ్మమే ఈ ఆత్మ స్వరూపము.

22. నాంతః ప్రజ్ఞం, న బహిఃప్రజ్ఞం, నో భయతఃప్రజ్ఞం, నప్రజ్ఞాన ఘనం, నప్రజ్ఞం, నాప్రజ్ఞం, అదృష్ట, మవ్యవహార్య మగ్రాహ్యా, మలక్షణ, మచింత్య, మవ్య

పదేశ్య, మేకాత్మ ప్రత్యయసారం, ప్రపంచోపశమం, శాంతం, శివ, మద్వైతం, చతుర్థం మన్యంతే - ఆత్మా - స విజ్ఞేయః. [మాండూక్యము - 7]

తా॥ అంతఃప్రజ్ఞము, బహిఃప్రజ్ఞము, ఉభయప్రజ్ఞము, ప్రజ్ఞానఘనము, ప్రజ్ఞము, అప్రజ్ఞము, - అనుపదములతో నుపయోగింప వీలుకానిది. అది అదృష్టము, అవ్యవహార్యము, అగ్రాహ్యము, అలక్షణము, అచింత్యము, అవ్యపదేశ్యము, ఏకాత్మ ప్రత్యయసారము, ప్రపంచోపశమము, శివము, అద్వైతము, చతుర్థమని తలఁతురు. అది - ఆత్మ - అదియే తెలియఁదగినది.

23. న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే.

తా॥ ఆత్మతో సమానమైనదికాని - అధికమైనదికాని మఱొకటి లేదు.

24. ఆత్మైవ సంవిశత్యాత్మ నాత్మానం యఏవం వేద.

తా॥ వ్యాపకత్వ మాత్మమొక్కటియేయని యెవఁడు తెలిసికొనునో అతఁడు తనకుఁదాను ఆత్మను ప్రవేశించును.

25. హృదిహ్యేష ఆత్మా. [ప్రశ్నోపనిషత్ 3-6]

టీక: ఏషః హి ఆత్మా = ఈజీవాత్మ, హృది = హృదయమందుండును.

26. తీర్థాని తోయరూపాణి దేవాన్ పాషాణ మృణ్మయాన్
యోగినో న ప్రపద్యంతే ఆత్మధ్యాన పరాయణాః.

తా॥ ఆత్మధ్యానముచేయు మహనీయులు జలరూపములయిన తీర్థములను, శిలామయములు, మృణ్మయములునగు దేవతలను సేవింపరు.

27. ఘటాభావే ఘటాకాశో మహాకాశో యథాతథా
ఉపాధ్యభావే త్వాత్మైవ స్వయం బ్రహ్మైవ కేవలమ్.
[గౌడపాదాచార్యుల కారిక]

తా॥ ఘటము నశించినతరువాత అందుండు ఆకాశము మహాకాశములోఁ గలిసి పోవునట్లు ఉపాధి నశింపఁగానే ఆత్మ కేవలబ్రహ్మమగును.

28. ఇంద్రియై ర్బధ్యతే జీవ ఆత్మావై నచ బధ్యతే
మమత్వేన భవే జ్జీవో నిర్మమత్వేన కేవలః.
[యోగచూడామణ్యుపనిషత్]

తా॥ మమకారముచే జీవుఁడై ఇంద్రియములచే బంధింపఁబడుచున్నాఁ మమకారరహితుఁడై, కేవల పరబ్రహ్మస్వరూపమగు ఆత్మ దేనిచే బంధింపఁబడ లేదు.

29. కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే.

[శుకరహస్యోపనిషత్

తా॥ ఈజీవుఁడు కార్యమైన అవిద్యను ఉపాధిగాఁ గలవాఁడు. ఈశ్వరుఁ కారణమైన మాయను ఉపాధిగాఁగలవాఁడు కార్యకారణములను నిగ్రహించినయెఁ పూర్ణజ్ఞానస్వరూపియైన ఆత్మయే శేషించుచున్నది.

30. ప్రకృతి స్త్వంపుమా స్త్వంచ వేదాన్యేన క్వచి ద్భవేత్
జీవ స్త్వం సాక్షిణోభోగీ స్వాత్మనః ప్రతిబింబకః.

[పద్మపురాణము - గణపతిఖండమ

తా॥ ఓకృష్ణా! ప్రకృతియు నీవే - పురుషుఁడవు నీవే - దేనిచేత నిన తెలిసికొనుట కగును. సర్వసాక్షియైన నీ యాత్మ ప్రతిబింబముగాను, భోగము నన వించువాఁడుగను నుండుజీవుఁడును నీవే - సర్వము నీవై నీ కంటె నన్యములేఁ భావము.

31. బుద్ధ్యాత్మభావయో రైక్యం జీవ ఇత్యభిధీయతే.

[అధ్యాత్మరామాయణము

తా॥ బుద్ధియు, అందుతోఁచునట్టి ఆత్మప్రతిబింబమును అను నీ రెంటియొక సంబంధమే జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

32. ఆత్మన స్తత్వవిజ్ఞానాత్ తత్వం బ్రహ్మైవ కేవలమ్

[సూతసంహిత - ముక్తికాండము

తా॥ వాస్తవమైన ఆత్మజ్ఞానమువలన జీవుఁడు బ్రహ్మమేయని తెలియనగున

34. అహం బ్రహ్మాస్మి వాక్యాచ్చ జ్ఞానా న్మోక్షో భవే న్నృణామ్.

[సనత్కుమారసంహిత

తా॥ నేను బ్రహ్మమునైయున్నాను - అను వాక్యముచేఁగల్గిన జ్ఞానమ మనుష్యులకు ముక్తి గలుగుచున్నది.

35. యథాఘుటేషు నష్టేషు ఘటాకాశో న నశ్యతి
తథా దేహేషు నష్టేషు నైవనశ్యామి సర్వగః. [అద్వైతానుభూతి.]

తా॥ కుండలు నష్టమైనపుడు ఘటాకాశమెట్లు నశించుట లేదో అట్లే శరీరములు నశించినపుడు సర్వత్ర నిండియుండు నేను నశించుట లేదు.

36. ప్రతిబింబ చలత్వద్యా యథా బింబస్య కర్హిచిత్
నభవేయు స్తథాభాస కర్తృత్వ ద్యాస్తు నాత్మనః.
[అద్వైతానుభూతి.]

తా॥ ప్రతిబింబమునందలి చలనము బింబమున కెట్లులేదో అట్లు చిదాభాసుని యందుఁగల కర్తృత్వాదు లాత్మకు లేవు.

37. జన్మాస్తిత్వవివృద్ధయః పరిణతి శ్చాపక్షతి ర్నాశనమ్
దృశ్యస్త్యైవ భవన్తి షడ్వికృతయో నానావిధవ్యాధయః
స్థూలత్వాదిచ నీలతాద్యపి మితి ర్వర్ణాశ్రమాది ప్రధాః
దృశ్యన్తే వపుషో నచాత్మన ఇమే తద్విక్రియా సాక్షిణః
[శంకరాచార్య సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహము.]

తా॥ జన్మించుట, ఉండుట, పెరుగుట, మార్పుచెందుట, కృశించుట, నశించుట - అనునవి షడ్భావ శరీరవికారము లనఁబడును. మఱియు నానావిధ వ్యాధులు, బలియుట మొదలగునవి - నలుపు మొదలగుగుణములును, వర్ణాశ్రమాది వ్యవహారములును ఈ శరీరమునకుఁ గనుపడుచున్నవే కాని శరీరమునకు సాక్షియగు ఆత్మకు కనఁబడవు.

38. తత్వమసి - ఈ మంత్రము శుకరహస్యోపనిషత్తునందును, సామవేద మగు ఛాందోగ్యమునందును జెప్పఁబడియున్నది.

టీక: తత్ = ఆ ఆత్మ, త్వం = నీవు, అసి = అయితివి. ఆ ఆత్మ - లేదా — పరమాత్మ నీవై యున్నావని భావము.

39. "అయమాత్మా బ్రహ్మ" - ఇది మాండూక్యము, బృహదారణ్యకములఁ గలదు. అహంబ్రహ్మాస్మి" - ఇది బృహదారణ్యకమునఁగలదు. "ఆనందోబ్రహ్మ" "ప్రజ్ఞానమానందంబ్రహ్మ" ఈ రెండును ఋగ్వేదీయ ఐతరేయోపనిషత్తునందుఁ జెప్పఁబడినవి.

40. సచ్చిదానంద ఏవ త్వం విస్మృత్యాత్మతయా పరమ్
జీవభావ మనుప్రాప్తః స ఏవాత్మాపి బోధతః.
అద్వయానంద చిన్మాత్ర శుద్ధసామ్రాజ్య మాగతః.

తా॥ నీవే సచ్చిదానందస్వరూపివి. ఆత్మతత్వమును మఱచితివి. ఆత్మయగు నీవు జ్ఞానముచేత అద్వయానందచిన్మాత్రుఁడవై యోగసామ్రాజ్యమునంది ప్రకాశింపుము.

41. అహంజ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః
జ్యోతిర్జ్యోతిః స్వయంజ్యోతిః ఆత్మజ్యోతిః శివోఽస్మ్యహమ్
[శ్రీ శంకరాచార్యకృతబ్రహ్మనామావళి.]

తా॥ అంతరజ్యోతి, బహిర్జ్యోతి, ప్రత్యగ్జ్యోతి, పరాత్పరము, జ్యోతికంటె జ్యోతి, స్వయంజ్యోతి, ఆత్మజ్యోతి సర్వము నేనే - నేనే శివుఁడనైతిని.

42. ఆనందరూప మాత్మాన మజ్ఞాత్వైవ పృథగ్జనః
బహిస్సుఖాయ యతతే నతు కశ్చి ద్విదన్ బుధః.

తా॥ అజ్ఞానియగువాఁడు తన్ను ఆనందస్వరూపుఁడని తెలియక బహిస్సుఖములకై ప్రయత్నించుచున్నాఁడు. విజ్ఞానసంపన్నుఁ డేవాఁడును గృహభోగాది సంపదలకు ప్రయత్నింపఁడు.

43. యదానందరూపం ప్రకాశస్వరూపం
నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యం
అహం బ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం
పరబ్రహ్మ నిత్యం తదేవాహ మస్మి.

తా॥ ఆనందము, స్వప్రకాశము, నిష్ప్రపంచము, అఖండము నేనే బ్రహ్మమని తెలియదగినది. తురీయము, శాశ్వతము, పరబ్రహ్మమైనదేదో అదేనేను అయితిని.

44. మయ్యేవ సకలంజాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహమ్.
[శ్రీ శంకరాచార్యకృత మహావాక్య సిద్ధాంత స్తోత్రము.]

తా॥ నాయందే సమస్తము జనించెను. నాయందే సర్వము ప్రతిష్ఠితమై యున్నది. నాయందే సకలము లయమందుచున్నది. కాఁబట్టి ఆ యద్వయపరబ్రహ్మమును నేనే.

45. ఆత్మన ఏష ప్రాణోజాయతే. [ప్రశ్నోపనిషత్ 3 - 3.]

తా॥ ఈప్రాణ మాత్మనుండియే పుట్టుచున్నది.

46. ఇదం బ్రహ్మాస్మీతి సాక్షాత్ ప్రత్యబుద్ధ్యత తస్మాత్ సఏవ సర్వశరీరే ష్వేకఏవాత్మా నాన్య ఇతి. [ఐతరేయోపనిషత్ శంకరభాష్యమ్]

తా॥ సాక్షాత్తుగా ఈపరబ్రహ్మమునైతినని గుర్తెఱిగినవాఁడు సర్వశరీరముల యందు ఒకే ఆత్మగలదు. ఇతరమేమిలేదని గుర్తించును.

47. లోకాంతరేవాఽత్ర గుహాంతరేవా
తీర్థాంతరే కర్మపరంపరాంతరే
శాస్త్రాంతరే నాస్త్యనుపశ్యతా మిహ
స్వయం పరబ్రహ్మ విచార్యమాణే. [శ్రీ శంకరుల వాక్యము]

తా॥ పరబ్రహ్మము ఇహపరలోకములయందుఁగాని, గుహలయందుఁగాని, తీర్థములయందుఁగాని, యజ్ఞయాగాదికర్మపరంపరలయందుఁగాని, శాస్త్రములయందుఁ గాని లేదు. విచారించి చూచువారలకు తనయందు తానేయైయున్నది.

48. నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖమ్
నమంత్రం నతీర్థం నవేదా నయజ్ఞః
అహంభోజనం నైవభోజ్యం నభోక్తా
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

[శ్రీ శంకరాచార్య నిర్వాణషట్కము.]

తా॥ పుణ్యములేదు, పాపములేదు. సౌఖ్యములేదు, దుఃఖములేదు. మంత్రము లేదు, తీర్థములేదు. వేదములేదు, యజ్ఞములేదు. భోజనమును, భోజ్యమును, భోక్తను నేనుగాను. చిదానంద స్వరూపుఁడగు శివుఁడను నేనే - శివుఁడను నేనే.

49. సత్యం జ్ఞాన మనంతంచ - బ్రహ్మలక్షణ ముచ్యతే
సత్యత్వాత్ జ్ఞానరూపత్వా దనంతత్వా త్త్వమేవహి.

[శ్రీ శంకరాచార్యకృత తత్త్వోపదేశము.]

తా॥ ఆపరబ్రహ్మము సత్యమును, జ్ఞానమును, అనంతమును గలదని యెఱుంగుము. అట్టి లక్షణములెల్ల నీయందున్నవి, కనుక ఆ పరబ్రహ్మము నీవని తెలిసి కొనుము.

50. జ్యోతిర్మయోఽస్మ్యహం జ్యాయాన్ జ్యోతిషాంజ్యోతి రస్మ్యహమ్.

తా॥ ఈప్రపంచమందు జ్యోతిర్మయుండను నేను జ్యోతులకు జ్యోతి స్వరూపుఁడను నేనే.

51. చిదాత్మా సర్వదేహేషు వ్యాపితం జ్యోతిరూపకమ్
సాజ్యోతి శ్చక్షురగ్రేచ గురునేత్రేచ పశ్యతి.

తా॥ చిదాత్మ సకలజీవుల శరీరములయందును అనఁగా హృదయ గుహల యందు జ్యోతిర్మయమై ప్రకాశించుచున్నది. ఆజ్యోతిని నేత్రాగ్రమందును, గురు నేత్రమునందును చూడనగును.

52 బ్రాహ్మణ్యం కులగోత్రేచ నామ సౌందర్యజాతయః
స్థూలదేహగతా ఏతే స్థూలా ద్భిన్నస్య మే నహి,

తా॥ బ్రాహ్మణ్యమును కులగోత్రములును, నామసౌందర్యజాతులును స్థూల దేహము నాశ్రయించినవిగాని తద్భిన్నమైన ఆత్మకు లేవు. శరీరసంయోగమే జననము శరీరవియోగమే మరణము.

53. త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

[భగవద్గీత - సాంఖ్య - 45]

తా॥ రజస్సత్త్వతమోగుణములఁ దెలుపునవి వేదములు నీవా మూఁడుగుణములు లేనివాఁడవై, ద్వంద్వరహితుఁడవై, సత్త్వగుణోపేతుఁడవై, యోగక్షేమరహితుఁడ వుగా, ధీరుఁడవుగా, ఆత్మజ్ఞానవంతుఁడవుగా నుండుమని శ్రీకృష్ణుఁ డర్జునుని సంబోధించి పలికెను.

54. ఆత్మాంబురాశౌ నిఖిలోఽపి లోకో
మగ్నోఽపి నాచామతి నేక్షతేచ
ఆశ్చర్య మేత న్మృగతృష్ణికాభే
భవాంబురాశౌ మృగతే మృషైవ.

తా॥ ఈ ప్రపంచమంతయును ఆత్మయను సముద్రమందు మునిఁగినదయ్యు నందలి యొకబిందువునునైనను త్రాగదు. మఱియు చూడదు; కాని యెండమావులతో సమానమగు సంసారసముద్రమున వ్యర్థముగా వెదకుచున్నది ఎంత యాశ్చర్యము.

55. అధిష్ఠానం సమ స్తస్య జగత స్సత్య చిద్ఘనమ్
సోహమస్మీతి నిశ్చిత్య వీతశోకో భవత్యయమ్.

తా॥ ఈ సమ స్త జగత్తునకు అధిష్ఠానము సచ్చిదానందము. అట్టి సచ్చిదానంద రూపుఁడను నేనని నిశ్చయించి దుఃఖరహితుఁ డగుచున్నాఁడు.

56. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.
[భగవద్గీత – ఆత్మసంయమయోగము _ 29 శ్లో]

తా॥ తనయాత్మయం దితర ఆత్మస్వరూపములు, ఇతరయాత్మలయందు తన ఆత్మస్వరూపము యోగముచే సమదృష్టిగలవానికిఁ గలుగును. సర్వత్ర సమదర్శులై సాధకులుందురు.

57. దేహభావేన దాసోహం జీవభావే తదంశకః
ఆత్మభావే తదేవాహ మితి జానీహి సత్తమ।

తా॥ దేహభావముతో దాసుఁడను జీవభావమందు ఆత్మయొక్క అంశమును. ఆత్మభావమందు నేనే ఆ పరమాత్మనని గ్రహింపుము.

58. ఆత్మవిద్యా విహీనస్య శోకసాగర ఏవహి
ముక్తిరేవాత్మ నిష్ఠస్య నా స్తి సంశయకారణమ్. [బ్రహ్మగీత]

తా॥ ఆత్మవిద్య నెఱుగనివానికి దుఃఖసముద్రమే శరణ్యము. ఆత్మనిష్ఠగలవాఁడు ముక్తినొందుననుటలో సంశయ మేమాత్రము లేదు.

59. అహంక్రతు రహంయజ్ఞ స్స్వధాహ మహ మౌషధమ్
మంత్రోహ మహమేవాజ్యం అహమగ్ని రహం హుతమ్.
[భగవద్గీత – రాజగుహ్య నిరూపణయోగము 16 శ్లో]

తా॥ నేనే యజ్ఞమును, మహాయజ్ఞమును, పితృదేవతల కీయఁదగిన స్వధను, ఔషధమును, ఆజ్యమును, అగ్నిని, హోమమును సర్వమును నేనే.

60 స సర్వధీ వృత్త్యనుభూత సర్వ
ఆత్మాయథా స్వప్నజనే క్షిత్యైకః
తం సత్యమానందనిధిం భజేత
నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః.

తా॥ జాగ్రత్స్వప్నసుషుప్తి వృత్తుల ననుభవించిన ఆత్మ పీలాగున ఒక్కఁడ అట్టి సత్యస్వరూపుఁడు, ఆనందరూపుఁడైన ఆత్మ తానుగా తెలియవలెను. అట్లు తెయక దేహేంద్రియములు తానుగా తెలిసిన ఆత్మహత్యాపాతకము.

61. సర్వత్రో త్సృజ భేదజ్ఞానమ్

తా॥ అన్నియెడల నీవునేనను భేదజ్ఞానమును వదలిపెట్టుము.

62. శుద్ధోపి బుద్ధోపి నిరామయోసి
సంసారమాయా పరివర్జితోసి
సంసారస్వప్నం త్యజమోహనిద్రాం
మదాలసా వాక్య మువాచ పుత్రమ్.

తా॥ నీవు పరిశుద్ధుఁడవు, జ్ఞానస్వరూపివి, నిరామయుఁడవు, సంసారమాయ వర్జితుఁడవు మోహనిద్రను వీడుము. సంసారస్వప్నమును వీడుము - అని మదాలస తనపుత్రున కుపదేశించెను

63. నాహం ప్రాణో నైవ శరీరం న మనోహం నాహంబుద్ధిః
నాహమహంకారధియౌ చ యోత్రజ్ఞాంశ సోస్మ్యహ
మేవేతి విదుర్యమ్.

తా॥ నేను ప్రాణమును, శరీరమును, మనసును, బుద్ధిని, చిత్తాహంకారములను గాను - ఎఱుకయే స్వరూపముగలవాఁడను నేనే.

64. యోన్యథా సంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే
కింతేన నకృతం కర్మ చోరేణాత్మాపహారిణా.

[భారతము - ఆదిపర్వము - 74 సర్గ - 28

తా॥ ఎవఁడు దేహేంద్రియాతీతుఁడును, సచ్చిదానందరూపుఁడును అయిన ఆత్మను దేహముగా అనుసంధించునో వాఁడు ఆత్మాపహారియైన చోరుఁడు.

65. యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ
యచ్చాస్య సంతతోభావః తస్మాదాత్మేతి కీర్త్యతే

[శ్రీ శంకరాచార్యులు]

తా॥ ఇది యన్నిటిలోను వ్యాపించును. ఇది యన్నిటిని గ్రహించును. విషయములనెల్ల భోగించును. సర్వదా సద్భావముగలిగి యుండును. గాన ఇది ఆత్మయని కీర్తింపఁబడుచున్నది.

66. ఏకఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్.

తా॥ భూతాత్మ యొక్కఁడే ప్రతిభూతమందు నున్నాఁడు. ఏకత్వమందు వ్యష్టియు, బహుత్వమందు సమష్టియు నీటిలో చంద్రబింబమువలె నున్నది.

67. పశ్యత్వ మాత్మ నాత్మాన మమలం పరమం పదమ్.
[శ్రీ కూర్మపురాణము - గౌరీవాక్యము]

తా॥ నీయొక్క పరమపదమైన ఆత్మను ఆత్మచేతనే చూచుకొనుము.

68. వేమనపలుకుల విలోకింపుఁడు.

కం॥ తనలో సర్వంబుండఁగ
తనలోపల వెదకలేక ధరణిని వెదకే
తనువుల మోసెడి యెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా॥

ఈ వేమన సూక్తికి మూలము బృహదారణ్యకమున నిట్లున్నది.

మంత్రము: యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యో సావన్యోఽహ మస్మీతి నసవేద పశురేవ ఏ స దేవానామ్.

తా॥ దేవతవేరు, నేను వేరు - అనుభావనతో ఉపాసించినవాఁడు పశువు. సజాతి, విజాతి, స్వగతభేదములు లేకుండినయెడల అద్వైతసిద్ధి కలుగును.

## షట్చక్రములు - లేదా - షట్కమలములు

వలయాకారముగా నుండుటచే చక్రములని-దళములుండుటచే-అనఁగా రేకు లుండుటచే కమలములనియు-లేదా-పద్మములనియు వీని నందురు. ఇంతవఱకు యోగ శాస్త్రములో చక్రములని కమలములని ప్రయోగములు కానవచ్చుచున్నవి.

ఇవి యేడు-సహస్రారముతోఁగూడి యేడగుచున్నవి. ఇది వేయిరేకుల కమలము. సహస్రకిరణుఁడు, సహస్రాక్షుఁడు, ఇత్యాదులలోని సహస్రశబ్ద మనేకార్థమే కాక, అత్యధికార్థమేకాక పూజ్యార్థమందిదియు వాడఁబడుచున్నది.

చక్రములు - లేదా - కమలములు.

1. ఆధారము - 2 స్వాధిష్ఠానము - 3. మణిపూరకము - 4 అనాహతము - 5. విశుద్ధము - 6. ఆజ్ఞేయము - 7. సహస్రారము.

## 1. ఆధారచక్రము :

దీనినే మూలాధారమనియు నందురు. ఆధారమనఁగా ఆదరువు. అన్ని చక్రములకు ఆదరువై ముఖ్యమై యలరారుచున్నది. రంధ్రముల నుండిగాని - రోమకూపముల నుండిగాని ద్రవాదు లేమి వచ్చినను ప్రాణిభరించి నిలువరించుకొనును: కాని ఆధార చక్రము నియతి తప్పిన నిలువలేఁడు.

ఇది గుదస్థానమందుండెడి నాడులకెల్ల ఆధారమైన చక్రము - మలద్వారమునకు రెండంగుళములపై నుండును. రేకులు నాల్గు - అందు వ-శ-ష-స అను వర్ణములుండును. పీతవర్ణము-భూముద్ర-నాసికేంద్రియముకారణము - గణపతి అధిదేవత - హంసలు ఆఱువందలు.

సూ॥ ఆధారే బ్రహ్మచక్రం త్రిదావర్తం భగమండలాకారం తత్ర మూలకందః తత్రశక్తిం భావనాకారం ధ్యాయేత్. తత్త్రైవ సర్వకామేశ్వరపీఠం సర్వకామఫలప్రదం భవతి.

## 2. స్వాధిష్ఠానము:

దీనిని సాధిష్ఠానమనియు నందురు. సాధిష్ఠానమనఁగా మిక్కిలిపదిలముగానుండు నదియని భావము. స్వ + అధిష్ఠానము. అనఁగా స్వస్య అధిష్ఠానం - తనకునివాసస్థానమని భావము. తాను తనరూపమున వెడలు శుక్లశోణితములకు మూలమైనదని పిండితార్థము.

అధిష్ఠానము = కోశ బలమువలనఁ గలిగిన తేజము, సృష్టికి మూలమైన రజోగుణము - అని నైఘంటికార్థములు.

ఈ కారణమున సృష్టి కధిపతియైన బ్రహ్మ ప్రజాపతిరూపమున నుండుటచే సృష్టిక్రమమున కిది మూలమనుట స్పష్టము.

ఆధారచక్రమునకు రెండంగళములపైని ఉపస్థదగ్గర ఈ చక్రముండును. దీనికి రేకు లాఱు. బ - భ - మ - య - ర - ల - అను వర్ణము లుండును. శ్వేతవర్ణము, జలముద్ర, జిహ్వేంద్రియము కారణము. బ్రహ్మ అధిదేవత - పొత్తికడుపున నుండును. హంసలు ఆఱువేలు - దీనినే పక్షిముద్రయనియు నందురు.

సూ॥ ద్వితీయం స్వాధిష్ఠానచక్రం - తన్మధ్యే పశ్చిమాభిముఖం లింగప్రవాళాంకుర సదృశం ధ్యాయేత్ తత్త్రైవ ఓఢ్యాణపీఠనిలయం జగదాకర్షణం భవతి.

## 3. మణిపూరకము:

దీనిని మణిపూరమనియు నందురు. మణియనఁగా శ్రేష్ఠవాచకము, ఉత్తమ సర్పము - అని అర్థముకలదు. రేచక, పూరక, కుంభకములలో పూరకమనఁగా ఊపిరి పూరించుట యగును. అనఁగా సర్పాకారముగా నాభియందు చుట్టచుట్టుకొన్న మణి పూరకమునుండి స్థితిస్వరూపమంతయు జరుగును దీనినే కుండలియని దీనిపై వసించు నతని కుండలీంద్రుఁడనియు నందురు.

"మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ కుండలీంద్రుండు తన్మహనీయస్థితి మూలమై నిలువ" అని శ్రీరామరాజభూషణకవీంద్రులు తన వసుచరిత్రలో ఈ తత్వరహస్యమును వెల్లడించిరి. ఇది సత్వగుణప్రధానమైనది.

స్వాధిష్ఠానచక్రమున కెనిమిదంగళముల మీఁద నాభికడ మణిపూరక చక్ర ముండును. దీనికి తేకులు పది. డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-అను వర్ణము లుండును. దీనినే పీఠముద్ర అనియు నందురు. నేత్రేంద్రియము కారణము. విష్ణ వధిదేవత. హంస లాఖువేలు.

సూ॥ తృతీయం నాభిచక్రం - పంచావర్తం. సర్పవ త్కుటిలాకారం. తన్మధ్యే కుండలీశక్తి బాలార్కకోటి సదృశం ధ్యాయేత్ సా మధ్యశక్తిః సర్వసిద్ధిదా భవతి.

## 4. అనాహతము:

దీనినే ఆహిత చక్రమందురు. ఆహిత మనఁగా ఉంచఁబడినది - లేదా - ఆ సమంతాత్ హితమ్ = ఆహితమ్ = అంతట మేలైనది. లేదా - ఇష్టమైనది అనియు నందురు. హృదయమందిరమున ప్రాణవాయువున్నచోట నిది యుండుటచేతను, సమస్త వాక్యావళికేకాక ప్రణవనాదమున కిది కేంద్రమగుటచేతను ఇది ముఖ్యాతి ముఖ్యమైనది. న + ఆహతము = అనాహతము = దేనిచేతను కొట్టఁబడనిది యని పిండితార్థము.

మణిపూరమునకు పదియంగుళములపైని వక్షస్థల మందలి హృదయస్థానమున ఈ అనాహతచక్ర ముండును దీనికి తేకులు పండ్రెండు - క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-అను వర్ణము లుండును. బంగారు రంగు. వాయుముద్ర. దీనినే లింగ ముద్రి యందురు. చర్మేంద్రియము కారణము. రుద్రుఁ డధిదేవత హంస లాఖువేలు.

సూ॥ చతుర్థం హృదయాధారం అష్టదళకమలం అధోముఖం తన్మధ్యే కర్ణికాయాం లింగాకారం జ్యోతి ర్ధ్యాయేత్. సైవాహం సకలా సర్వేంద్రియ వశ్యో భవతి

5. విశుద్ధము:

విశుద్ధమనఁగా నిర్మలమైనదని యర్థము. జీవులెల్ల కంఠగతప్రాణములు గలవపుటచేత గొంతులోనుండు గాలిలో ఏమాత్రము నలకపడినను, కఫాదు లడ్డుపడినను నిలువనీయక తన స్వచ్ఛతను చాటుకొనఁజూచును.

అనాహతమునకు ఎనిమిదంగుళముల మీఁద - (రాజయోగసారమందునను, కాలజ్ఞానమందును పండ్రెండంగుళములు) విశుద్ధచక్రముండును. దీనికి జేకులు పదియారు - అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః-అను వర్ణము లుండును. శ్వేతవర్ణము - ఆకాశముద్ర. దీనినే మత్స్యముద్ర యనియు నందురు శ్రోత్రేంద్రియము కారణము. కంఠస్థానము - జీవుఁ డధిదేవత - హంసలువేయి.

సూ॥ పంచమం కంఠచక్రం చతురంగుళమ్. తత్ర వామే చంద్రనాడీఇడా - పింగళాసూర్యనాడీ - తన్మధ్యే సుషుమ్నాం ధ్యాయేత్. సైవ అనాహతకళా-అనాహత సిద్ధి ర్భవతి.

6. ఆజ్ఞేయము:

దీనినే ఆజ్ఞాచక్రమనియు నందురు. ఇది భ్రూమధ్యస్థానమందుండి వాయు పంచకమునకు కూడలియై ఇడా - పింగళా - సుషుమ్నలకు నిలయమై సద్గురు సంస్థానమై ఎఱుకకు గుఱియై సర్వత్ర ఆజ్ఞాపూర్వకముగా ప్రవర్తించునది కనుక దీనిని ఆజ్ఞాచక్రమనియు, ఆసమంతాత్ జ్ఞేయం = ఆజ్ఞేయం = అంతట తెలిసికొనఁదగిన దగుటచే ఆజ్ఞేయచక్రమనియు నందురు. ఇది పరబ్రహ్మైవలోకమునకు ప్రాముఖ్యమైనది.

విశుద్ధమునకు ఆఱంగుళములమీఁద (పదంగుళములని కాలజ్ఞానము.) భ్రూమధ్యమందు ఆజ్ఞేయచక్ర ముండును. దీనిని కోలాటమండప మందురు. దీనికి జేకులు రెండు-అం-క్షం-అను వర్ణము లుండును. అగ్నికాంతి. ప్రకాశముద్ర - మహత్తత్త్వము పరమాత్మఁ డధిదేవత - హంసలు వేయి.

సూ॥ షష్ఠం భ్రూమధ్యచక్రం తత్ర అంగుష్ఠమాత్రం జ్ఞాననేత్రం దీపశిఖాకారం ధ్యాయేత్ వాచాసిద్ధి ర్భవతి,

7. సహస్రారము:

షట్చక్రములపై శిరోమధ్యమందు సహస్రారచక్ర ముండును. దీనినే బ్రహ్మ రంధ్రమనియు నందురు. ఈ బ్రహ్మరంధ్రమును భేదించుకొని ప్రాణవాయువును వదలిన పునర్జన్మము లేదందురు. దశవిధవాయువుల వశమొనర్చుకొన్న పరమహంసలకు మాత్రమే ఇది సాధ్యమగును.

బ్రహ్మరంధ్రస్థానమున ఈ సహస్రార చక్రముండును. దీనికి రేకులు వేయి. ఇందు సర్వసర్వాత్మికమైన ప్రణవబీజ ముండును. హకార, సకార బీజద్వయము ఆత్మబిందువుతోఁగూడి హంస - సోహం అనుచుండును.

"అహం బ్రహ్మాస్మి" అను మహావాక్య చతుష్టయార్థమే ఈ సోహం తెలుపుచుండును. సగుణ - నిర్గుణ - స్వరూపుఁడగు సచ్చిదానంద గురుమూర్తి సర్వసాక్షియై ఈ సహస్రారకమలమున కధినేతయై యుండును. హంసలు వేయి-ఆకాశముద్ర.

సూ॥ సప్తమం బ్రహ్మరంధ్రం నిర్వాణచక్రం సూచికాగ్రభేద్యః - ధూమశిఖాకారం ధ్యాయేత్. తత్ర జాలంధరపీఠం మోక్షప్రదం భవతి.

ఈ షట్చక్రములతోఁ గూడిన సహస్రార పర్యంతము హంసలు అనఁగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఇరువది యొక్క వేయి ఆఱునూరులు తిరుగుచుండును.

శ్రుతి: షట్శతం గణనాథస్య షట్సహస్రం ప్రజాపతేః
షట్సహస్రం మహావిష్ణోః॥ షట్సహస్రం మహేశ్వరః
సహస్రం జీవరూపస్య సహస్రం ఈశ్వరాత్మనః
సహస్రం గురురూపస్య ఏకం బుధ్యా ప్రకల్పయేత్.

| 1 | చక్రములు | అధిపతులు | సంఖ్య |
|---|---|---|---|
| 1. | ఆధారము | గణపతి | 600 |
| 2. | స్వాధిష్ఠము | బ్రహ్మ | 6000 |
| 3. | మణిపూరకము | విష్ణువు | 6000 |
| 4. | అనాహతము | రుద్రుఁడు | 6000 |
| 5. | విశుద్ధము | జీవుఁడు | 1000 |
| 6. | ఆజ్ఞేయము | ఈశ్వరుఁడు | 1000 |
| 7. | సహస్రారము | పరమాత్మ | 1000 |

దినమునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు —21600

## హంసల వివరణము

| హకారము | సకారము | బిందువు |
|---|---|---|
| సూర్యనాడియను | చంద్రనాడియను ఇడానాడి | తేజోనాడి |
| పింగళానాడి | ఎడమ ముక్కు | యను సుషుమ్నా |
| కుడి ముక్కున | వాయువును పీలుచును. | నాడి |
| వాయువును పీల్చును. | శోణితము. | వాయువును |
| శుక్లము | | స్థిరముగా |
| నిర్విషయ జ్ఞానము. | ప్రపంచ విషయ జ్ఞానము | నిలుపును. |
| శివబీజము. | శక్తిబీజము. | |

సూచన: ఇందలి హకారము శివబీజము, సకారము శక్తిబీజము ఈ శివ శక్తుల సంయోగ సంబంధమే బిందువు.

—షట్చక్ర వివరణము సమాప్తము—

## ఆయుః పరిమాణము

శ్లో॥ శతాయు ర్మానుషాణాం చ శతద్వంద్వం చ రక్షసాం
సహస్రమాయు ర్వృక్షాణాం తదర్థం గుల్మసంతతేః
షట్త్రింశ న్మృగపక్షీణాం సహస్రం ఫణికాకయోః
చౌషష్టి ర్వ్యాఘ్ర మార్జాలే శతం కేసరి హస్తినాం
జలూకచాకరాణాం చ మండూకానాం శతత్రయం
ద్వాత్రింశ దాయు రశ్వానాం షోడశాజాదికా స్మృతాః
హంసానాం పంచదశకం కుక్కుట స్యాష్ట వర్షకం
తథా క్రోష్టృ సృగాలానాం వరాహాణాం త్రయోదశ
గృధ్రోలూక సహస్రంచ కీన కాక్షే తథైవ చ
ఉష్ట్రాణాంచ శతంవర్షం గర్ధభానాం చ వింశతిః
వింశద్వర్షం విహంగానాం వర్షం జీవేత్ పిపీలికాః
అండ జోద్భిజ్జ జంతూనాం పంచమాసాః ప్రకీర్తితాః
స్వేదజానాం చైకమాసం జంతో రాయుష్య నిర్ణయః.

టీ॥ మానవులకు నూరు సంవత్సరములు, రాక్షసులకు రెండు నూరులు, వృక్షములకు వేయి, పొదలు మొదలగు లతలకు అయిదు వందలు, మృగములకు -

పక్షులకు ముప్పదియాఱు, పాములకు - కాకులకు వేయి, పెద్దపులికి-పిల్లికి అఱువది నాల్గు, ఏనుఁగు-సింహములకు నూరు, జెలగ-చక్రవాక-మండూకములకు మూఁడు వందలు, గుఱ్ఱములకు ముప్పది రెండు, మేఁకలకు-గొఱ్ఱెలకు పదియాఱు, హంసలకు పదిహేను, కోడికి ఎనిమిది, నక్కలకు-కుక్కలకు ఎనిమిది, పందులకు పదమూఁడు, గ్రద్దలకు, గుడ్లగూబలకు వేయి, రాబందులకు వెయ్యి, ఒంటెలకు వంద సంవత్సరములు, గాడిదలకు ఇరువది, పక్షుల కిరువది, చీమలకు ఒక సంవత్సరము, గ్రుడ్లవలన భూమి నుండి పుట్టువానికి అయిదు మాసములు, చెమటవలన పుట్టు నల్లులు - పేలు మొదలగు వానికి ఒక మాసము అని ప్రాణికోటి కాయుష్య నిర్ణయము.

## గురు వాక్యము

శ్లో॥ అతో బ్రహ్మాత్మ విజ్ఞాన ముపతిష్టం యథావిధి
మయాచార్యేణ తే ధీరః సమ్య క్తత్ర ప్రయత్నవాన్.

తా॥ ఓ ధీరుఁడా! ఆచార్యుఁడనగు నాచేత బ్రహ్మాత్మ విజ్ఞానము క్రమ ప్రకారముగా నీ కుపదేశింపఁబడినది. ఈ విషయమున ప్రయత్నశీలుఁడవై ప్రవర్తింపుము.

శ్లో॥ భూత్వా విముక్త బంధ స్త్వం ఛిన్న ద్వైతాత్మ సంశయః
నిర్ద్వంద్వో నిస్పృహో భూత్వా విచరస్వ యథాసుఖమ్.

తా॥ నీవు బంధవిముక్తుఁడవై తివి. ద్వైతాత్మ సంశయము ఖండింపఁబడి నందున ద్వంద్వాతీతుఁడవు, ఆశారహితుఁడవు నై తివి; కావున ఇఁక నీకెట్లు సుఖమో అట్లు సంచరింపుము.

## శిష్యవాక్యము

1. ధన్యోహం ధన్యోహం నిత్యం
స్వాత్మాన మంజసా వేద్మి
ధన్యోహం ధన్యోహం బ్రహ్మా
నందో విభాతి మే స్పష్టమ్.

2. ధన్యోహం ధన్యోహం దుఃఖం
సాంసారికం న వేక్షేఽద్య

ధన్యోఽహం ధన్యోఽహం న్వస్యా
జ్ఞానం పలాయితం క్వాపి.

3. ధన్యోఽహం ధన్యోఽహం క_ర్తవ్యం
మే న విద్యతే కించిత్
ధన్యోఽహం ధన్యోఽహం ప్రా_ప్తవ్యం
సర్వమంత్ర సంపన్నమ్.

4. ధన్యోఽహం ధన్యోఽహం ప్రశమిత
కరణ స్సమాహి తాత్మాహం
ధన్యోఽహం ధన్యోఽహం స_త్త్వం
చి_త్తస్వరూప మాత్మాహమ్.

5. ధన్యోఽహం ధన్యోఽహం తృ_ప్తే
ర్మే కోపమా భవే ల్లోకే
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో
ధన్యః పునః పున ర్ధన్యః [యాజుషీయ అవధూతోపనిషత్]

— పంచీకరణభాష్యము సమా_ప్తము —

కం॥ రూపించు వేదశిఖలను
దీపించు మహాత్మతత్వదీప్తుల దిశలన్
చూపించు ము_క్తి మార్గము
ఈ పంచీకరణభాష్య మెల్ల విధాలన్.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 20 | 10 | జేయము | జ్ఞేయము |
| 31 | 21 | క్షుతృష్ణ | క్షుత్తృష్ణ |
| 34 | 23 | పంచప్రాణములలో ఉదానమును గలుపవలెను. | |
| 36 | 7 | అంతకరణ | అంతఃకరణ |
| 43 | 14 | నిర్వ్యాజస్వీయ | నిర్వ్యాజస్వీయ |
| 51 | 9 | మయోమోదాది | మయామోదాది |
| 56 | 21 | శుబేచ్ఛ | శుభేచ్ఛ |
| 69 | 10 | స్వవ్నము | స్వప్నము |
| 73 | 7 | స్వాధిషాన | స్వాధిష్ఠాన |
| 80 | 1 | సముద్భూత | సముద్భూత |
| 80 | 4 | పదా | సదా |
| 80 | 9 | అఖిలఖేద | అఖిలభేద |
| 85 | 12 | కక్మపరంపర | కర్మపరంపర |
| 86 | 14 | ధనార్జున | ధవార్జున |
| 90 | 22 | రెండంగళములు | రెండంగుళములు |
| 90 | 26 | తన్మధ్వే | తన్మధ్యే |
| 91 | 10 | దంగళములు | దంగుళములు |
| 92 | 1 | తన్యధ్యే | తన్మధ్యే |
| 93 | 15 | ఆఋపందలు | ఆఋవందలు |
| 94 | 7 | స్థిరిముగా | స్థిరముగా |
| 95 | 4 | ఎనిముది | ఎనిమిది |
| 95 | 8 | ప్రాణికోటి | ప్రాణికోటి |
| 95 | 11 | షయా | మయా |
| 95 | 15 | నంశయః | సంశయః |
| 96 | 1 | స్వస్యాజ్ఞానం | స్వస్యాజ్ఞానం |